# త్వరలో విడుదల !

స్వతంత్రా వారి

# దీక్ష

DIRECTOR PRASAD

PRODUCER PRAKASH RAO

CAMERA........SRIDHAR RAO

ART........SARMA

STUDIO........SOBHANACHALA




SWATANTRA FILMS LTD MADRAS 17

డిస్ట్రిబ్యూటర్సు :

ఆంధ్ర & రాయలసీమ :
ప్రీమియర్ ఫిలింసు లిమిటెడ్ బెజవాడ.

మైసూర్ :
యశోధరా ఫిలింస్ కార్పొరేషన్, బెంగుళూరు సిటీ.




# మంచి రుచి అయినది- చాలా బాగుండును

సమృద్ధిగా ఉన్నవి.

బోర్న్-విటాలో ఎముకలను నిర్మాణంచేసే ద్రవ్యాలు, బలమిచ్చే ద్రవ్యాలు 95%కు ఎక్కువగా ఉన్నవి. ఇందుకు తోడు, ఇది చాలా రుచిగా ఉంటుంది. జీర్ణశక్తిని వృద్ధి చేస్తుంది, తేలికగా విపాకమవుతుంది. ముఖ్యంగా స్త్రీలు గర్భవతులుగా ఉన్న సమయంలోను, వ్యాధి నుంచి తేరుకొనేటప్పుడు ఇది బాగా ఉపయోగపడుతుంది.

## కాడ్బరీస్

# బోర్న్-విటా

కాల్సియం విటమినులు ఎక్కువగా ఉన్నవి.

కాడ్బరీ శ్రేష్ఠతకు ప్రసిద్ధం.

సరఫరాలు దొరకకపోతే, ఈ చిరునామాకు వ్రాయండి:
కాడ్బరీ-ఫ్రై (ఎక్స్‌పోర్ట్) లిమిటెడ్, (Dept 25) పోస్ట్ బాక్సు నెం 1417; బొంబే.

# ఆంధ్రమహిళ

సంపుటి 4 :: (ఏప్రిల్ '48) :: సంచిక 10

ముఖచిత్రం : ఉగాదిలక్ష్మి




సంపాదకురాలు : దుర్గాబాయి యమ్. యే., బి. యల్.

సహసంపాదకురాలు : మామిడిపూడి వైదేహి బి. యే., (ఆనర్సు)

—: ప్రచురణ :—

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా — అయిదు రూపాయలు




సంపుటి 4 ఏప్రిల్ 1948 సంచిక 10

# సర్వధారికి సుస్వాగతము

సర్వజిన్నామ సంవత్సరం హిందూదేశ చరిత్రలో మరుపదగని కొన్ని సంఘటనలతో గడచిపోయింది. రమారమి రెండువందల సంవత్సరాలుగా బ్రిటిషు యింపీరియాలిజమ్ శృంఖల బద్ధమైన మనదేశమునకు స్వాతంత్ర్యములభించింది. కాని ఆ స్వాతంత్ర్య జ్యోత్స్నను శాంతియుతముగా ననుభవించు యదృష్టము మనకు లేక పోయినది. మన విశాల దేశము రెండు తునకలుగా విభజింపబడ్డది. శాంతి సమరానంతరము—దేశమంతటిలో అనివార్యమైన రక్త ప్రవాహము, మతహంకారుల దుర్మార్గము, అనాధ యువతుల ఆర్త నినాదం, తల్లులు పోయిన పిల్లల రోదన, సర్వము వీడిన శరణార్థుల తీవ్ర సమస్యలు—అయ్యో మన దౌర్భాగ్యము! యిదియా మన స్వరాజ్య ఫలితం—నలుగురిలో నగుబాట్లు మనకీ అగచాట్లు.

‘మూల్గుచున్న నక్కపై తాటికాయ’ యన్నట్లు మన జాతికి ‘బాపు’ శాంతిదూత, అహింసాప్రచారి, మతసామరస్య సంఘటనకై ప్రేమ ప్రబోధము జేసెడి మన ప్రియనాయకుడు, ఒక మతోన్మాది చేత హతుడగుటయా? ఆహా—యిక దుర్మార్గమున కంతేది? అశాంతికి హద్దేది? తొలగిపొమ్ము సర్వజిత్తు, గొనిపొమ్ము నీతోడ వేవేగ యీ మా దౌర్భాగ్యము, రమ్ము, రమ్ము సర్వధారీ! గైకొనుము మా సుస్వాగతము, పోగొట్టుము మా మౌర్ఖ్యము, రాబట్టుము సుజ్ఞానము.

# సర్వధారికి సుస్వాగతము

అన్నదమ్ములలో నైకమత్యత వర్థిల్లాలిగాని భద్రతా సమితులు అంతఃకలహములను తీర్చలేవనుటకు కాశ్మీరు జునగాడ్ సమస్యలకన్న తార్కాణములు వేరుగా కావలెనా? విషవాయు బాంబులు, క్రిమిబాంబులు, ఏటమ్‌బాంబులు మొదలైన మారణాస్త్ర ప్రయోగములు మానవుని వినాశ హేతువులే యగునుగాని, సమస్యా పరిష్కార మార్గములు కానేరవని అగ్రరాజ్యముల వారంగీకరింపవలదా? ద్వితీయ ప్రపంచమహాసంగ్రామ సంక్షుభితమైన యీ ప్రపంచంలో శాంతివాయువులు నలుప్రక్కల వీయక పూర్వమే, మరోయుద్ధపు తలంపులు బయలు దేరుట శుద్ధతెలివి తక్కువ కాదా? విశ్వమానవ సుహృద్భావము, అహింసా మంత్రాస్త్రమే విశ్వజాత్యైక్యత, విశ్వమానవ కళ్యాణము నొనగూర్చునను విషయమును గుర్తింపవలదా ?

అమ్మా సర్వధారీ రమ్ము—విశ్వమానవ కళ్యాణమే లక్ష్యముగా మేమందరమూ అహింసా వ్రత దీక్షను బూని; దేశమును శాంతి, సుభిక్షయుతముగ జేయుమార్గముల మమ్ము సంచరింపజేయుము.

"సర్వేజనా స్సుఖినోభవంతు."



## "ఆంధ్రమహిళ" జన్మదిన సంచిక

ఈ సంచికతో 'ఆంధ్రమహిళ' పత్రికకు నాలుగు సంవత్సరాలు గడచిపోతున్నవి. వచ్చే 'మే' నెల సంచికను 'జన్మదిన' సంచికగా వెలువరిస్తున్నాము. ఈ సంచికకు రచయితలు చిన్నచిన్న వ్యాసాలను అచ్చులో రెండు మూడు పేజీలు మించకుండా కాగితానికి ఒక ప్రక్కనే వ్రాసి ఏప్రిల్ 10 వ తేదీలోగా పంప గోరుతున్నాము.

—సంపాదకురాలు.

## స వ ర ణ

గత సంచికలో "గాంధీజీ ఉపదేశాలు" అన్న శ్రీమతి చన్నగంటమ్మ కృష్ణారావుగారి వ్యాసం ఆలిండియా రేడియో వారిచే బ్రాడ్‌కాస్ట్ చెయ్యబడినది. పొరపాటున ఇది వారి అనుమతినిప్రకటించినట్లు పేర్కొనలేదు. దీనిని పాఠకులు గమనించ కోరుతున్నాము

—సంపాదకురాలు.

# మాతా శ్రీ కస్తూరిబా

శ్రీమతి కె. ఆర్. లక్ష్మి

మాతృశ్రీ కస్తూరిబా చతుర్థ వార్షిక దినంనాడు (22-2-44) దేశమంతటా సభలు, సమావేశాలు జరిగాయి. సానుభూతి సానుపాప పూర్వకమైన తీర్మానాలతోనే సరిపుచ్చక నాటిసభలలో శ్రీ కస్తూరిబాను ప్రతీ మహిళ ఆదర్శంగా గొని తమ తమ జీవితాలను అదే విధంగా రూపొందించుకోవాలని ఉద్బోధనలు జరిగాయి. మహత్తరమైనత్యాగానికి శ్రీ కస్తూరిబా కంటె తార్కాణంగా ఎన్నదగినవారు ఎవరూ లేరు. ఆమె మనుగడ, ఆమె జీవితము ఆత్మ సంయమనశక్తిని సూచించే ఒక మధుర గీతమని కొందరు అన్నారు.



ఈ ప్రశంస ఆమె విషయంలో చాలదేమో. ఎరవాడ చెరసాలలో ఆమె మరణించినపుడు ఆమె బ్రిటిష్ ఇంపీరియలిజానికి తన తనువునే అర్పించిన త్యాగశీల అని ఎందరో సంస్తుతించారు. ఈ త్యాగం ఆమె తన జీవితాన్ని ఎట్టి పవిత్ర లక్ష్యాలకై సఫలతకై అంకితం చేసిందో వాటికే తార్కాణం.

ఆమె త్యాగ సహిష్ణుతలకు, 'ఇది కారణ' మని మనం నిరూపించలేము. ఆమె ప్రకృతిలో అనేక సుగుణాలు ఇమిడి వున్నాయి. మన విశ్వాసాన్ని, ప్రేమాదరాలను, గౌరవాన్ని చూరగొన గలిగే మహోత్కృష్టమైన శక్తి ఏదో ఆమెలో అంతర్భూతమై వున్నది.

తాను ఒకరికి ఉద్దేశ పూర్వకంగాగాని—ఒక ధర్మానికి కట్టుబడిగాని సేవ చేస్తున్నట్లు తెలుసుకోకుండానే ఆమె గాంధీజీకి, దేశానికి, మొత్తం మానవజాతికి సేవచేసింది.

"ఆమెలోని అత్యుత్తమ గుణం గొప్పతనం కాదు. మంచితనం. లోకంలో తెలివైనవారు—ప్రతిభావంతులు, ఎందరో వున్నారు. ఒక్కొక్కరికి ఒక్కొక్క విషయంలో ప్రతిభవుండ వచ్చు. ఒక్కొక్క విషయంలో కౌశల పరిజ్ఞానాలు వుండ వచ్చు. కాని వీటితోపాటు 'మంచి తనం' అనేదికూడా వుండాలి. అది లేకపోవడమే అనర్థంగా పరిణమిస్తుంది. కస్తూరిబాలోవున్న గొప్ప తనం కంటె మంచితనం హెచ్చు. ఆమె జీవితం ఈవిషయాన్నే స్పష్టీకరిస్తుంది" అన్న మినూమసానీ ప్రశంసలోఎంతైనా సత్యంవుంది.

ఆమె జీవితం త్యాగానికి ప్రతిరూపం. విధివిధానాన్ని అనుసరించి ఆమె లోకోత్తర పురుషుడైన గాంధీజీకి ధర్మపత్ని అయింది. గాంధీజీ తన జీవిత విధానాన్ని నిర్ణయించుకొంటూ ఆమె జీవితానికి ఒక లక్ష్యం ఏర్పడగల పరిస్థితులను కల్పించాడు. ఆ లక్ష్యమే త్యాగం.

తాను చేస్తున్నది త్యాగమని ఆమెకు తెలియదు. తెలిసి చెయ్యలేదు. కాని బాపూజీ కల్పించిన పరిస్థితులను కాదనడానికి శక్తి లేకపోయినా ఆయన జీవితానికి మెరుగు దిద్దగల అపూర్వశక్తి ఆమెలో వుంది. కనకనే భారతదేశ భవితవ్య నిర్ణయంలో గాంధీజీతో పాటు ఆమెకూడా అనల్పమైన బాధ్యతను నిర్వహించింది.

స్వరాజ్య సమరాంగణంలో ఆమె ప్రవేశించడానికి గాంధీజీ కారణభూతుడుకాదు. తన పతి సాగిస్తున్న స్వాతంత్ర్య సమరంలో తానుకూడా ప్రవేశించాలనే కోరిక కలగడానికి ఆమె తన బాల్యంనుంచి నిర్ణయించుకొన్న కొన్ని

లక్ష్యాలే కారణం. భర్త యెడల భార్య భక్తి విశ్వాసాలతో మెలగాలి అని ఆమెకు బాల్యంలోనే బోధించబడింది. ఆ ధర్మాన్ని ఆమె అక్షరాల పాలించింది.

ప్రపంచానికే విభ్రాంతికలిగించగల ఒక మహాశక్తి స్వరూపుని సమక్షంలో ఆమె తన వ్యక్తిత్వాన్ని నిలుపుకొని శతాబ్దాల తరబడిని ప్రజలు అనుసరించదగు ఒక జీవిత విధానాన్ని చాటింది. ఆమె వేదికల నెక్కి ఉపన్యసించలేదు. గ్రంథాలు రచించలేదు. మహాత్మునితోడి సాహచర్యంలోనే ఆమె స్వభావంలోని వెలుగులు మనకు కనిపించాయి.

గాంధీజీ ఆత్మకథ చదివినపుడు ఆమె తన భర్తకు కేవలం బానిసగా వుండలేదని—ఆయన చెప్పిన దల్లా గ్రుడ్డితనంగా, తన విధి నిర్ణయంగా భావించి చెయ్యలేదని బోధపడుతుంది. తన వ్యక్తిత్వాన్ని ఆమె జీవించినంత కాలం నిలుపుకొంది. తనకై తాను ఏర్పాటు చేసుకొన్న కొన్ని లక్షాల సంసిద్ధిని ఆశించే పాటుపడింది. బాపూజీ చెప్పినట్లు చెయ్యడం ఆమె దుర్బల హృదయంవల్లకాదు. ఆయనలోని గొప్పతనాన్ని, శక్తిని దాని ప్రభావాన్ని పూర్తిగా గ్రహించడంవల్లనే.అలాగ్రహించిన తర్వాతనే ఆయన సిద్ధాంతాలకు అనుగుణంగా తన జీవితాన్ని ఆమె మార్చుకున్నది. ఆయనకు అవసరమైన ధైర్యం కలిగించడం, ప్రోత్సహించడం తనకు విధివిహితమని నిశ్చయించుకొంది. ఆయన నడుస్తున్న పథం కుపథమైవుంటే—కస్తూరిబా, భర్త కనక విశ్వాసంగావున్నప్పటికీ ఆయన చర్యలకు మాత్రం ప్రోత్సాహ మిచ్చేడిది కాదు.

ఆయనకు ప్రోత్సాహమివ్వడంలో ఉచితానుచితాలను నిర్ణయించగలగడమే ఇతర సతుల కంటె ఆమె మిన్నకావడానికి హేతువయింది.

సతీపతుల మధ్య కొన్ని సందర్భాలలో సంఘర్షణలు జరగకపోలేదు. వాటిని గురించి చెబుతూ ఆమె ఒకసారి "ఆయన మహామహిమాన్వితుడు. తన తప్పులను ఒప్పుకొంటారు. నన్ను ఎప్పుడూ అన్యాయ్యంచెయ్యలేదు"అన్నది. ఆయన చెప్పిన దానిలో తనకు నమ్మకం కలగనపుడు ఆ పని చెయ్యడానికి నిరాకరించిన సందర్భాలు వున్నాయి. డర్బన్‌లో వున్నపుడు పంచముడైన గుమాస్తా ఉపయోగించే పాత్రనుకూడా తోమి శుభ్రంగావుంచమని గాంధీజీ ఆదేశించాడు. ఆ ఆదేశాన్ని ఆమె తిరస్కరించింది.

"నా యింటిలో ఇటువంటి తిరస్కారాలకు అవకాశం లేదు."అని ఆయన కోపావేశంతో అన్నాడు. "మీ ఇల్లు మీరే అట్టే పెట్టుకోండి. నన్ను పోనివ్వండి" అంది ఆమె.

అలాగే తనకు ఆ తర్వాత కోడలు వచ్చినపుడు నగలకోసమని కొంత బంగారాన్ని ఆమె అట్టే పెట్టుకొంది. ఇది కిట్టని గాంధీజీ "ఆ బంగారం నేనే చేసిన సేవకు ఇతరు లిచ్చినది "అని హెచ్చరించడంతో ఆమె వెంటనే ఇలా బదులు చెప్పింది :—"నిజమే. మీరు చేసినది సేవ అయితే నేను చేసినదీ సేవే. మీరు చేసినా నేను చేసినాకూడా అది సేవే. మీరు ఎవరికో సేవ చేస్తే—అహోరాత్రాలూ—మీకు—మీరు ఇక్కడకు వేళాపాళాలేకుండా తీసుకువచ్చి నెత్తిమీద కూర్చోపెట్టేవారికి నేను సేవచెయ్యడం లేదా?"

సోక్రటీస్ చేతలను సహించక ఆయన భార్య క్రోధాగ్ని స్ఫులింగాలను నిత్యం వర్షిస్తూ ఒకసారి బిందెడు నీళ్లు నెత్తిమీద గ్రుమ్మరించింది. అలాగే టాల్‌స్టాయ్ భార్య సోఫియా కూడా భర్త చెప్పినట్లు నడుచుకోనడానికి నిరాకరించింది. అలాగే కస్తూరిబా చేసివుంటే గాంధీజీ జీవితం ఏ విధంగా వుండేనో కదా? ఒకసారి బార్డోలీ రైతులు గాంధీజీ తమకు ఉపకారం చెయ్యడంలేదని ఆమెతో చెప్పగా "ఆయన ఎప్పుడూ ప్రజల మేలునే కోరుతూ వుంటారు. మీకు తప్పక ఉపకారం చేస్తారు" అన్నదామె.

"నేను ఆమెపట్ల కాఠిన్యం దయకూడా వహించాను. ఆమెకు ఉపదేష్టగా, వ్యవహరిస్తూ ఆమె ఎడల నాకుగల ప్రేమాతిశయంచేత ఎంతో చికాకు కలిగించాను. ఇప్పుడు నేను ఆమెకు ఉపదేష్టను కాను. కాపురానికివచ్చిన కొత్తలో ఆమె ఎడల నేను ఎంత కఠినంగావున్నానో, ఇప్పుడు ఆమె నా యెడల అంత కంటె ఎక్కువ కఠినంగా వుండవచ్చు. ఇద్దరమూ ఇప్పుడు ఒకరినొకరంబాగా గ్రహించుకొన్న స్నేహితులం. ఆమె కించిత్తు ప్రతిఫలాన్నైనా ఆశించక నా కోసం తన జీవితాన్ని సమర్పించినది. రోగిని నర్సువలె కాపాడింది. తనకు ఉపయుక్తమని తోచిన విధంగా నాకు, దేశంలోని 40 కోట్ల ప్రజలకు మాత్రమేగాక మానవ జాతికే సేవ చేసింది" అని గాంధీజీయే ప్రశంసించాడు.

ఇంతకంటె వేరు సంస్తుతి అనవసరం. ఆమె ఎప్పటికీ ఆదర్శసాధ్విగా వెలయగలదు.



# రాష్ట్రీయ సంఘసేవకుల ప్రథమ సమావేశము

* శ్రీమతి అల్లాడి అన్నపూర్ణగారు *

జనవరి 9, 10, 11, 12 తారీకులలో మద్రాస్ రాష్ట్రంలో సంఘసేవ చేయుచున్న సేవాసమాజం Guild of service సభ్యుల సమావేశము చెన్నపట్నంలో అతివైభవంగా జరిగింది. మద్రాస్ కేంద్ర సంస్థ అధ్వర్యంలో ఈ సమావేశం జనవరి 9 వ తేదీన ఉదయం 11 గంటలకు గవర్నమెంటు బాన్క్వెటింగుహాలులో ప్రారంభంచేశారు. మొదట థియసాఫికల్ సొసైటీ అధ్యక్షులైన సి. జినరాజాదాసాగారు ప్రార్థన చేశారు. తరువాత శ్రీమతి వి. టి. లక్ష్మీగారు లేడీ మౌంటుబాటన్ ఆరోగ్య శాఖా మంత్రిణి రాజకుమారీ అమృతకౌర్ గవర్నర్ రాజాజీ బొంబాయి ప్రధాని బి. జి. ఖేర్ మాధవమీనన్ మొదలైనా వాళ్లు పంపిన శుభ సందేశాలను చదివి వినిపించినారు. ఉపన్యాస వేదికను చాలా శృంగారముగా అలంకరించారు. వేదికపై గవర్నర్ దంపతులు ప్రధానమంత్రి రామస్వామి రెడ్డిగారు శ్రీ బెజవాడ గోపాల రెడ్డిగారు డానియల్ థామస్‌గారు శ్రీమతి మాధవ మీనన్ శ్రీమతి మేరిక్లబ్బువాలా మొదలైన పలువురు ప్రముఖులు ఆశీనులైనారు.

సమావేశానికి రాష్ట్రంలో ఉండే వివిధ ప్రాంతాలనుండి సేవాసమాజాల తరఫున దాదాపు 200 మంది డెలిగేట్లు వచ్చినారు. ఆహ్వాన సంఘాధ్యక్షురాలు కుట్టి అమ్మాళ్ గారు వివిధ జిల్లాలనుండి వచ్చిన అభ్యర్థులను బాగా పని చేస్తున్నపని, ఇంకాకూడ బాగా పని చేయవలెననియు సంఘంలో కొద్ది గొప్ప బేధములు కాని జాతీ మత వివక్షణ గాని వాళ్ల దృష్టిలో ఉండకూడదని ఈ విధమైన సేవయే ప్రస్తుతం దేశమునకవసరమని చెప్పిరి. కార్యక్రమం పట్నాల్లో కంటె పల్లెటూళ్లలో ఇంకా ఎక్కువగా జరగవలెనని చెప్పారు. తరువాత సేవాసమాజం కార్యదర్శి శ్రీమతి మేరి క్లబ్బువాలాగారు సమాజము యొక్క కృషి నివేదికను సభ వారికి ఎరుకపరుస్తు ప్రభుత్వము యొక్కయు ప్రజల యొక్కయు సహకారాన్ని కోరారు. సమాజం స్థాపించి చాలా కాలంకాలేదు. కాబట్టి ఎక్కువ పని ఇంకా చేయలేదు. అందరి సహకారంవల్ల ఇకమీద ఈ పని బాగా జరుగగలదని నమ్ముచున్నానని చెప్పారు.

తరువాత మన రాష్ట్ర ప్రధాని సమావేశాన్ని ప్రారంభిస్తు పూర్వకాలంలో బౌద్ధ సన్యాసులు చేసిన సేవను ఇప్పుడు క్రైస్తవమత ప్రచారకులు సేవను ప్రశంగించారు. ప్రస్తుతం శ్రీ రామకృష్ణ మిషను కస్తూరిబా స్మారక సంఘం వారు ఈ పనిలో పూర్తిగా నిమగ్నులైయున్నారు. అందువల్ల ఈ దినము సమాజాలు తమ కర్తవ్యాన్ని ఇదమిత్థమని నిర్ణయించుకొని ఒక ప్రణాళికను ఏర్పచుకొని దాని ప్రకారం కార్యం ప్రారంభించవలెనని సలహానిచ్చిరి. తరువాత గవర్నర్ నైగారు సేవాసమాజాలు ఒక నిర్మాణ కార్యక్రమాన్ని కులకక్ష మత వివక్షత లేకుండా ఏర్పరుచుకొని తదనుగుణంగా సేవ చేయవలెనన్నారు. వ్యక్తిగత అభిప్రాయ బేధాలు భిన్నభిన్న అభిప్రాయలు వారు చేసే పనికి అడ్డు రాకూడదు. ప్రభుత్వపాలన బాగా జరగాలంటె ఇటువంటి సేవాసమాజాల సహాయ్యం ఎక్కువ అవసరమని కూడ వారు చెప్పిరి.

గవర్నర్ నైగారి ఉపన్యాసానంతరం మంత్రి డానియల్ థామస్‌గారు గవర్నర్ దంపతులను గుఱించి ప్రధానిని గుఱించి ప్రశంశా వాక్యములను చెప్పారు. గవర్నర్ దంపతులు అధికార యుతమైన హోదా ఉన్నప్పటికి సామాన్య ప్రజలను పరామర్శించడం వారి యోగక్షేమములకై పాటుపడడం బీదల గుడిశలలోకి వెళ్లి వారి స్థితిగతులను తెలుసుకోడంలో వారు చూపించె ఉత్సాహం ఇంతా అంత కాదు. ఈ విధంగా ప్రజల యోగక్షేమాలను విచారించిన గవర్నర్ దంపతులు ఇంతకుముందు ఎవరూ లేరనికూడ చెప్పారు.

కార్యదర్శి మేరిక్లబ్బువాలాగారి వందన సమర్పణతో సమావేశం పూర్తి అయినది.

పిమ్మట సమావేశం కార్యక్రమం 6 భాగాలుగా విభజించ బడినది.

1. గ్రామోద్ధరణ.

# రాష్ట్రీయ సంఘసేవకుల ప్రథమ సమావేశము

2. ప్రభుత్వమునకును సంఘ సౌభాగ్యమునకును గల పరస్పర సంబంధము.

3. ప్రజల ఆరోగ్యము శిశు సంరక్షణ.

4. సంఘసేవికుల తర్ఫీదు చేయు విధానము. పాఠశాలలు ఇలాగే ఇంకా రెండు గ్రూపులు మొత్తం 6 భాగాలుగా విభజించబడింది.

ఈ చర్చలలో 2 విశేషములు కనిపించినవి. చర్చలను ప్రారంభం చేసిన వారందరు వారి అభిప్రాయలను వ్రాసికొని వచ్చిరి. కాని ఆ వ్రాతలలో అనేకములు సంఘసేవకు సంబంధించినవిగా గాని సంఘసేవ చేయువారికి గాని ఉపయోగించునవిగా ఉండలేదు. ఆరోగ్య విషయములను గురించి జరిగిన చర్చలలో అనేక రోగములను గురించి గొప్ప డాక్టర్లు కొన్ని వివరాలను చెప్పినారు. కాని ఇవన్నియు డాక్టర్లు అవగాహన చేసుకో తగియున్న వే. కాని సామాన్య సంఘసేవకులకు బోధపడునట్టివి కావు. బోధిపడినప్పటికి వారికి అంత అవసరమైన విషయముగా కనిపించలేదు. అదే విధముగా గ్రామ పునరుద్ధరణ గురించి ఉపన్యసించారు. వారిలో అనేకులు ప్రపంచములోనున్న వివిధ విషయములను వివరించిరి. వాటిలో ఒక విషయంకూడ సామాన్య సంఘసేవకులు చేయువనికి సంబంధించినగా లేవు.

ఈ సమావేశానికి రాష్ట్రం అంతటినుండి సంఘసేవకులు వచ్చారు. వారు ప్రస్తుతం చేయుచున్న పనికి సహాయపడు నటువంటి సలహాలు వారు పొందలేక పోయినారు. ఈ విషయంలో కొంచెం ఆశాభంగం కలగింది.

చాలా తీర్మానాలు చేయబడ్డవి. వాటిలో చాలావరకు ప్రభుత్వం వారి సహాయ్యం కోరవలిసి వచ్చింది. ఇంత పెద్ద కార్యక్రమ భారం ప్రభుత్వం ప్రస్తుత పరిస్థితులలో వహించడం దుర్లభం. సంఘ సేవ చేయువారే చాలావరకు ఈ కార్యక్రమాన్ని జరపపడం మంచిది.

మొత్తంమీద చాలా అంశములు చర్చించబడినవి. వెళ్లిన వాళ్లందరూకూడ ఇంతో అంతో జ్ఞానం సంపాదించుకున్నారు. ఇటువంటి సమాలేశాలవల్ల క్రమేణా ఉపయోగం ఉంటుంది.



# ఆర్థికన్యాయము ★ శ్రీ మా. వెంకటేశ్వర్లుగారు

జాతియొక్క ధనమును, వస్తువులను పంచుకొనుటకు సంబంధించిన న్యాయమే ఆర్థికన్యాయము. ప్రపంచమునందనేకులు కడుపునిండ నన్నములేని వారున్నారు. మరి కొందరు అది దొరుకుట చేత సౌఖ్యమును, వృద్ధిని పొందుచున్నారు. అట్టి పరిస్థితులులేక, న్యాయమైన ఆర్థిక సంఘ నిర్మాణమును స్థాపించుట ప్రభుత్వము యొక్క కర్తవ్యమై యున్నది. ఆర్థికన్యాయము వలననే క్రమతయు, నిర్భయత్వము సాధ్యమగును. నాగరికత అభివృద్ధిగాంచును. ముఖ్యముగ మన దేశమున గల దారిద్ర్యమునకు కారణము పరాయివారు మనలను అన్ని విషయములలో త్రొక్కిపెట్టి, మన పరిశ్రమలను పెంపొందనీయక జేయుట. నాగరికతాభివృద్ధికి స్వాతంత్ర్య మత్యవసరము. అట్టి స్వాతంత్ర్యము మనకిప్పుడు లభించనది. ఆర్థికాభివృద్ధికై స్వతంత్రభారతదేశము వెంటనే పాటుపడవలసియున్నది. మన దేశమటులుండ, మనము గమనించవలసినది "నేడు ధనమెట్లు పంచబడుచున్నది" అనెడు విషయము. ప్రపంచ చరిత్ర యందనేక విప్లవముల గూర్చి చదివియున్నాము. విప్లవములనేకములు సంభవించినను ఆర్థికన్యాయ మంతగా వృద్ధిచెందలేదు. అన్ని దేశాలలోను, ప్రజలనేకులు ఇంకను బీదరికములోనే కొట్టుకొనుచున్నారు. ధనాఢ్యులుకూడ కొందరున్నారు, కాని వీరికి మధ్య అనేకులు తినుటకు చాలినంత తిండి, ధరించుటకు చాలినన్ని బట్టలులేక కష్టపడుచున్నారు. మిక్కిలి ఆశ్చర్యకరమైన విషయమేమనగా—మిక్కిలి బీదస్థితిలోనున్నవారే, ఎక్కువ కష్టమైనట్టి—అనగా గనులలోను, కర్మాగారములలోను—పని చేయుచున్నారు. అంత కష్టపడి వారు పని చేయుచున్నప్పటికి, వారి వేతనములు బహు తక్కువ. జీవించుటకు చాలినంతకూడ వారికి గిట్టుట లేదు. వారి పరిస్థితులటులుండగా. ఇక ధనాఢ్యులను చూడుడు. కార్యక్రమమును నిర్ణయించుట, అధికారమును చెలాయించుట, చాల ధనమును తీసుకొని పోవుట, వారి పరమావధిగనున్నది.

అట్టి ఆర్థిక దుస్థితివలననే, 18వ శతాబ్దిలో ఫ్రెంచి విప్లవమేర్పడ్డది. మన కాలమందు సంభవించిన రష్యను విప్లవమునకును అదియే కారణము.

ప్రపంచమునందిట్టి ఆర్థిక భేదములేల యుండవలెను? చేసిన పనికిని, ప్రతిఫలమునకును హెచ్చు తగ్గులేల యుండవలెను? అనేకులీ విషయమును విమర్శ చేసియేయున్నారు. వారి సమాధానములను కొన్ని సంగ్రహించెదను.

ముఖ్యముగ యంత్రములు వచ్చిన పిమ్మట, వెనుకటికన్న హెచ్చుగ ప్రజల వస్తువులను తయారు చేయగల్గుచున్నారు. వెనుకటి కాలములో లేని వస్తువులను యెన్నిటినో కూడ తయారుచేయుచున్నారు. యంత్రముల మూలమున నాగరికత దినదినాభివృద్ధిగాంచుచున్నది. వస్తువులధికముగ దొరుకుచున్నవి. వాటి ధరలు కూడ నయమగుటచేత, ప్రజలనేకులు వాటిని కొనుచున్నారు. కాబట్టి యంత్రముల మూలముగా, ప్రజల పరిస్థితులు కొంతమటుకు అభివృద్ధి చెందినవి. వెనుకటి వారికంటె మనము చక్కగా బ్రతుకుచున్నామని చెప్పవచ్చును. కాని, యంత్రములవల్ల ధనము హెచ్చయినదిగదా! ఆ ధనమంత యేమిగుచున్నది? ఆ ధనములోని అధిక భాగము, ఏ కొద్దిమంది మనుష్యులో అనుభవించుచున్నారు. అదివరకుండెడి ధనవంతులు, మరింత భాగ్యవంతులైరి. యంత్రములు విజృంభించుటచేత, అనేకులెట్టి పని లేక యుండిరి. ఈ విషమపరిస్థితులిప్పటికి, ప్రపంచమునందంతటు వ్యాపించుటయే గాక, ప్రబలిపోవుచున్నవి. విజ్ఞాన శాస్త్రము మంచి వస్తువుల నిచ్చినది; కాని సరిసమానముగా అందరికిని, తగు భాగము వచ్చునట్లు చేయలేదు.

పైగా చాలా ధనము దుర్వ్యయమగుచున్నది. ముఖ్యముగ ప్రపంచ సంగ్రామములకెంత ధనము వ్యయమయ్యెనో తెలిసిన విషయమే. ఆటమ్ బాంబులకు తుపాకులకు యుద్ధములకు ప్రపంచములో చాల ధనము దుర్వ్యయ మగుచున్నది.

యంత్రముల మూలముననే, దేశ దేశములకు మానమానవులకు గల ఆర్థిక వ్యత్యాసము అధికముగ మార్పుచెందసాగెను;

# ఆర్థిక న్యాయము

వస్తువులను హెచ్చుగ వృద్ధి చేయుట తప్ప మరెట్టి సుఖమును యివ్వలేదు. పదునెనిమిదవ శతాబ్దాంతమున, పంతొమ్మిదవ శతాబ్ద ప్రారంభమున పారిశ్రామిక విప్లవము, ఇంగ్లాండు నందు యెన్నియో విషమ పరిస్థితులైనను వ్యాపింపజేసెను. పని చేయవలసిన గంటలు, అధికముగనుండెను. అంతేకాదు. ఇరువదినాలుగు గంటలలో పన్నెండు, పదునేను గంటలు పని జేయుటయే గాక, వెలుతురు లేనట్టియు, దుష్టవాయువులతో నిండినట్టి కర్మాగారములలోను అట్టి పని చేయుచుండిరి. పని హెచ్చుగనుండెను కాని, వారికి వేతనము చాల కొంచెముగ నుండుటచే, కుటుంబములకు దినములు గడచుట కష్టముగాను, ప్రాణముల నిలుపు కొనుటకూడ కష్టముగా నుండెను.

పని చేయుటకుగాని, మానుటకుగాని, మానవునకు స్వాతంత్రమున్నదను మాట వాస్తవమే. కాని ఆ స్వాతంత్రము నమలులో బెట్టుట కష్టమైన పని. పని చేయకున్న తిండిలేక మాడవలసివచ్చును. కాబట్టి యంత్రాధికారులు నియమించిన షరతులకు లోబడి పనిచేయుటకు ఒప్పుకొనక తప్పదు.

అట్లు ప్రారంభమయిన పారిశ్రామిక విప్లవము ప్రజలలో ఆర్థికాన్యాయమును వ్యాపింప చేయలేదు. ప్రపంచములో గొప్ప అశాంతి నానాటికి పెరుగ సాగెను. తుదకు 1917లో రష్యాలో విప్లవము సంభవించెను. ధనాఢ్యుల పరిపాలన అణగ ద్రొక్కి సామాన్య ప్రజాపాలనను నిర్మించుటయే రష్యాలోని విప్లవకారుల ముఖ్యోద్దేశము. ధనికుల పాలనను వదలించుకొని ఆ ధనమును, భూమిని జనసామాన్యమునకు పంచిపెట్టుటకై విప్లవకారులు పూనుకొనిరి. ధనికులను పదభ్రష్టులుగ జేసి ప్రభుత్వమును వశము చేసుకొని ధనమును, భూమిని పంచుకొను విధానమున కొన్ని మార్పులను జేసిరి. కాని వారి యత్నములు సఫలమయ్యెనా? లేదు. ప్రజలలోని దారిద్ర్యమును నిర్మూలించలేక పోయిరి. దీనికి కారణము ప్రజలకు తమ భావములను చెప్పుటకుగాని, వెల్లడించుటకుగాని స్వాతంత్ర్యము లేకుండుటయే.

సి. ఇ. యమ్. జోడ్ మహాశయుడు చెప్పినట్లు ఉన్న ధనమును నేటివలె గాక ఎక్కువ న్యాయముగా విభజించు వరకు ప్రపంచమున నాగరికత నిలువదు. ప్రపంచమున చాల భాగమున ధనముగాని ధనమునుబట్టి వచ్చు విద్యగాని స్వేచ్ఛగాని లేక పోవుటచేత ఆర్థిక విషయములు విషాదకరముగ నున్నవి. ఆర్థికన్యాయమున్నప్పుడే నాగరికత వర్థిల్లును.



# ఆంధ్రుల అభిమాన గీతిక

రచన : నాగిరెడ్డి వెంకటరత్నం　　　　సంగీతం : సూనేపల్లి వెంకటరాజు

జై జై జై శ్రీ ఆంధ్రమాత—అగణితభాగోపేత ॥జై॥
కలితాగాన సుధారస వాహినీ
నాగార్జున శిల్పకళా విదూషిణీ
సస్యమంగళ లక్ష్మీనివాసధరణీ
పావనీ..................జననీ.................. ॥జై॥

ఆంధ్రుల ఆర్తి తీరేదెన్నడు
ఆంధ్రుల కీర్తి ఎరిగేదెన్నడు
ఆంధ్రుల జ్యోతి వెలిగేదెన్నడు
ఆంధ్రరాష్ట్రము-వచ్చేదెన్నడు
తల్లీ.......... తెనుగు తల్లీ.......... ॥జై॥

హిందుస్థాని తోడిరాగం—ఆదితాళ.
( బేగ్రౌండ్ )

సరిగమ - పా ,,—దమగరి - సా ,,—దమగరి - సా ,,
సా ,, - నిరిసని—పదసా - నిద - మప—నీ - దప - గమపా - దమగరి - సా ,,
నిసగమ - దనిసరి - గా , రి - గమగరి—సనిదరి - సనిదప - గదపమ - గరిసా
నిసగమ - దనిసా - నీ , స - గరిసా—సనిదప - టదపమ - గరిసా - (సరిగరిసా)
జై - జై - జై - శ్రీ ఆంధ్ర మా - తా అగణీత భా - గో - పే - తా ॥జై॥
సగగస - గపపగ - పదనిద - పా , మ—పా ,, - (నీదపామగపమా ,,)
కలితా - గా - నసు ధా - రస వా - హి నీ...
సగగస - గపపగ - పదనిద - పా , మ—పా ,, - (నీ ,, - సా ,, - నిదపా)
కలితా - గా - నసు ధా - రస వా - హి నీ...
పదదప - దససా - స - దసరి - గాగస—గా ,, - (గాసదాపగదపా ,,)
నా - గా - ర్జునశి ల్పకళా - విదూషి ణీ...
పదదప - దససా - స - దసరి - గాగస—గా ,, - (గపమగ - పమగస - నీ ,,)
నా - గా - ర్జునశి ల్పకళా - విదూషి ణీ...
నీని - ద - నినినిద - దనినిరి - నీదప—మదపా - దాపమాగపమా ,,,
సస్యమం - గళా - ల - క్ష్మీ - నివాస ధరణీ పావనీ జననీ........॥జై॥
(గాస - గాస - దాపా ,, పదసా—గాస - గాస - దాపా ,, పదసా)
పదసరి - గాగా - గపమగ - సనిసస— రీరిరి - రీరిసని - నిససగ - రిససా
ఆం - ధ్రుల ఆర్తీ తీ - రే - దె - న్నడు ఆంధ్రుల కీర్తీ...ఎరుగె - దె - న్నడు
దరిసని - పనిదప - గపదస - నీసనిదాపా - పదపమ - గపమా - సగగప పదదస
ఆంధ్రుల జ్యో - తి - వెలిగే - దె...న్నడు ఆంధ్రరా - ష్ట్రియా వ - చ్చె - దె - న్నడు
సరిరిగా గసరి—గపపా ,,,,
త - ల్లీ - తెనుగు త - ల్లీ

# శాంతమే భూషణం

రచన: శ్రీమతి గుమ్మా కౌసల్యాదేవిగారు

(నా కథకు ప్రోత్సాహ మిచ్చి, మెరుగులుదిద్దిన శ్రీ పూర్ణగారికి నా కృతజ్ఞతలు)

కాంత గృహమునకు లక్ష్మి. పేరుకు తగినట్లు తెల్లవారే సరికల్లా కలకలలాడుతూన్న ముఖముతో మెరుస్తూచురుగ్గా పనిపాటులు చేసుకుంటూన్న గృహిణి. అందకత్తెకూడా ఇనుమునులాగే సూదంటురాయిలా చూచే వారిని తక్కున ఆకర్షించే ఆనవయౌవన, అంగసౌష్టవం, సుంద్రని ముఖముపై ఆ నల్లటి తిలకం, అరటి దవ్వల్లాంటి దండలూ తళతళ లాడుతూ నవ్వుతూంటే గుంటలు పడేటట్టు నున్నగా మృదువైన చెక్కిళ్లు చూస్తే అప్పుడే దేవలోకంలోంచి దిగిన అప్సరసకన్యలా మెరుస్తూవుంటుంది.

ఆమెకు అనాధులన్నా, పరోపకారమన్నా అమితమైన యిష్టం. ఆమెను ఎవరైనా తన వల్ల వుపకారం జరగాలని చెప్తే, ఆ పని నెరవేరేవరకు నిదురించదు. "తగిన అన్నంలోకి తగిన కూర దొరకదన్నట్టు" ఛాందసురాలైన అత్తవారికి కోడలు యొక్క ప్రవర్తన చూస్తే గిట్టదు. చాలా పిశినిగుట్టు. కాకికికూడా భిచ్చంపెట్టదు. అంత కఠిన హృదయ. ఎవరైనా ముష్టివాడు ముష్టి అడిగితే వంటింట్లోంచీ మడి నీళ్లు తెచ్చి ఆ అనాధుడు గుమ్మందాటే వరకూ వాడిపైని జల్లడమేగాకుండా అనేక శాపాకారాలు పడుతూ గెంటివేసి, అనాధుడు నిలుచున్న జాగామీద పేడనీళ్లు జల్లేవరకూ ఆ జాగా పవిత్రంగాదన్న మూఢురాలు.

కృష్ణారావు కాంతకు భర్త. భార్యంటే చాలా ప్రేమే కాని తల్లి మాటను జవదాటనివాడు కాడు. "ముసలి భర్త తన పడుచు భార్యకు గాడిదమల్లె భార్యమాటను జవదాటక ఆమె అడుగులకు మడుగు లొత్తుతూవున్నట్టు"—శాంత ప్రొద్దుటనుంచి వంటలక్కలా పొయ్యిదగ్గర కూర్చొని మధ్యాహ్నం తన అత్తవారికి భోజనం పెట్టింది. అది తిని వేశిన తడవుగా అంతఃపుర కాంతలా ప్రేవ్ మంటూ సావిట్లోకి దారితీసింది ఎంగిలైనా ఎత్తకుండా.

శాంత అప్పుడే భోజనం చేద్దామని కూర్చొంది. విస్తరి ముందు. యింకా కద్దైనా నోట్లోకి వెళ్లలేదు. యింతలో "అమ్మగారూ! మాతాఃకాలమమ్మా, పిడికెడు అన్నం వుంటే పడెయ్యండమ్మా" అని వీధిలోంచి వొక ఆర్తనాధం విన వచ్చింది. అన్నం గిన్నె చూచింది శాంత. ఖాళీ అయి పూరుకుంది. వెంటనే తన అన్నంలోంచి కొంత అన్న తీసి వెళ్లబోతూంది. కాని నిరాశయింది. అప్పుడే వీధిలో అత్తగారు ప్రత్యక్షంగాకుంటూ శాపాలు ప్రారంభిస్తోంది యిలా— గుంటడా! నీకు వేళాపాళాలేదురా? మాతాఃకాలమమ్మా, మాతాఃకాలమంటూ చెవికోసిన మేకలా అబ్బబ్బ నిద్దర పట్టడంలేను. నిన్ను గన్న తండ్రి యేమయేడు? ఛో, ఛో అంటూ, శాంతనుకూడా నొక ప్రక్క చూపుచూసి—

నీకుకూడా సిగ్గులేదే? యిదా భిచ్చం వెయ్యడానికి వేళ. బాబుగారి సొమ్ములా అన్నంపట్టు కొచ్చావ్ దానం చెయ్యడానికి. యివి రేపను రోజులనే సంగతి తెలుసునా! మరి యింకేం! మా వాడు రానీ, నీ ధర్మాలేమిటో, దానాలేమిటో నేనూ చూస్తాను అంటూ విషాన్ని గ్రక్కుతూంది.

లేదత్తా! ఒకరువేశి, యింకొకరు వెయ్యకపోతే యిటువంటి అనాధులకు కడుపునిండడం ఎలా? ఎవ్వరూ వెయ్యకుండా వుంటే, రోజుకి ఎంతమంది దీనారులు యీ ఆకలిమంటకు, యీ క్షామబాధకు యీ దరిద్రబానిసదేశంలో బలియౌతారో ఆలోచించండి? అన్నాదో లేదో, ఆ, ఆ ఆగు నోరుమూసుకో! ముందునడు యింట్లోకి అంటూ స్వరం పెద్దది చేసి అంది. యిది చూచిన దీనారుడు గడప దాటి పోయేడు. శాంత యింట్లోకి పోయింది కాని అన్నం ఏమీ నోట్లోకి వెళ్లలా, జరిగిన సంగతినే తలుస్తూ విచారించింది.

## శాంతమే భూషణం

కొన్నాళ్లకి అత్తగారికి జ్వరం ప్రారంభించింది. యింక లాభంలేదని డాక్టరుకూడా అన్నాడు. అత్తగారు పెట్టిన బాధల్ని మఱచి సేవలు చేసింది శాంత. కాని భగవంతుడు లేడూ! ఆ మర్నాడే యీ ప్రపంచాన్ని విడచి అనంత వాయువుల్లో ప్రాణాలు లీనమైనాయి అత్తగారికి. అత్త గారు పోయిన నాటినుండి యిల్లు కలకలలాడుతూ వుంది. అత్తగారు పోవడమే మేలయిందే! శాంతకు. ఇంతకూ చాలా అదృష్టవంతురాలే నే, అంటూ యిరుగుపొరుగు అమ్మలక్క లందరూ అనుకోవడం కృష్ణారావు విన్నాడు.

ఇంటికి వచ్చి అమాంతంగా శాంతను కౌగలించుకొని ఆమె హృదయాన్ని తన హృదయానికి హత్తుకొని—శాంతా! అమ్మ చెప్పిన మాటల్లి విని నీకు చాలా బాధలు పెట్టాను. నీవే నా నా భార్యవయినందుకు నే నెంతో అదృష్టవంతుణ్ణి. నే పెట్టిన హింసను మరచి నన్ను క్షమించవూ?

అబ్బా! పోనీ లెద్దురూ? భగవంతుడు తన భక్తుల్ని ఎలాగైతే శిక్షించి పరీక్షిస్తాడో—అలా మీరు నాకు దైవం గాబట్టి మీరు పెట్టిన పరీక్షకు నెగ్గగలిగేను గాబట్టి యిప్పుడు ఆనందం అనుభవిస్తున్నాను. అన్నట్టుగ ఆనందింలో మైమర చాను చెప్పడం. యీ వూర్లో వున్న "ఆంధ్రమహిళా సంఘంలో నేనుకూడా మెంబరునయి అనాధ స్త్రీలకు విద్యయందు, కళయందు తోడ్పాడాలనివుంది. యేమం టారు?

నీమాటకు అడ్డా శాంతా? "శాంతమే భూషణం" అంటూ కొనవరకూ నెగ్గగలిగే నీ కోరిక తీరుస్తా కాదు—నేనుకూడా స్త్రీ అభ్యుదయానికి తోడ్పతా అంటూ కృష్ణారావు శాంతను తనివి తీరా శాంత చెక్కిళ్లను నిమురుతూ ముద్దు పెట్టుకుంటాడు.

ఆహా! అటువంటి ఆనందం యీ దరిద్రబానిస భారత స్త్రీలకు యిక ముందైనా కలుగుతుందంటారా?



నాది నాది నాది




నాది నాది నాది

# అమృతాంజనము

గాని,

" యథాయథా.....................కాళీధవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పుఁజేయు పూనికతో పెరుఁగుచున్నప్పుడెల్లను, నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

# "గృహలక్ష్మి" స్వర్ణకంకణ మహోత్సవం



శ్రీమతి లక్ష్మీబాయమ్మగారు

7-3-48 తేదీ ఆదివారమునాడు కేసరి కుటీరమునందు గృహలక్ష్మి జయంత్యుత్సవసందర్భమున దేశసేవా పరాయణియగు శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారికి స్వర్ణకంకణ బహూకరణము జరిగినది. వ్యాధిగ్రస్తురాలగుటచే శ్రీమతి లక్ష్మీబాయమ్మగారి తరఫున ఆమె భర్తగారు శ్రీ లక్ష్మీనారాయణ పంతులుగారు కంకణమును స్వీకరించిరి.

లక్ష్మీబాయమ్మగారు మహిళాభ్యుదయమునకు సర్వతోముఖ కృషి యొనర్చిన 66 సంవత్సరముల వృద్ధురాలు. భారతభాగవతాది ప్రాచీన భారతీయ సంస్కృతి యీమె జ్ఞానమునకు మూలము. సనాతన హిందూమత చారిణి యయ్యు వితంతువివాహాది సంస్కరణోద్యమములలో ముందంజవేసిన ధీరనారి. భారతావనిని దాస్యశృంఖల విముక్తను గావించుటకై సత్యాగ్రహ శాంతి సమరములో ధైర్యసాహసములతో పోరిన వీరనారి. జాతీయ విద్యావ్యాప్తికై శారదా నికేతనమును స్థాపించి అకుంఠిత దీక్షతో 25 సంవత్సరములుగ స్త్రీజనోద్ధరణ చేయుచున్న విదుషి. స్వర్ణ కంకణ స్వీకారమున కీమె తగియున్నదనుట అతిశయోక్తి ఎంత మాత్రము కానేరదు.

దైవ కృపవల్ల ఈమె శీఘ్రకాలములో సంపూర్ణ దేహస్వాస్థ్యమునుబొంది, యింకనూ పెక్కువత్సరములు స్త్రీ జనాభ్యుదయమునకు తోడ్పడవలెనని మా ప్రార్థన.

# బాపూజీని బలిగొన్న భారతం

రచన: శ్రీమతి ఈడుపుగంటి రత్నమాంబగారు

(ప్రధాన కార్యదర్శిని, ఆంధ్రరాష్ట్ర మహిళాసంఘం)

మహాత్ముడు మరణించాడు, మహాత్ముడు చిరంజీవి అయ్యాడు. గాంధీ దేవుడు దేశ, కాల, కుల, మత వర్గాలకన్నిటికి అతీతుడై ఈ పిచ్చి ప్రపంచాన్ని సక్రమ మార్గంలో పెట్టి విశ్వ కల్యాణానికి దోవతీసే జ్యోతిగా వెలుగొందు గాక!

యావద్భారతదేశం సమస్త ప్రపంచం విశ్వమంతా ఈ అత్యంత విషాద సంఘటనకు ఘూర్ణిల్లుతున్నది. 'భగవానుని సృష్టి క్రమ లీలలో ఈ బలిదానాలకాండ తప్పని సరియా!

ఆ దయామయుని, ప్రేమమూర్తిని పొట్ట బెట్టుకొన్న హంతకుడు ఏమి సాధించదలచాడు? ఏమి సాధించగలడు? ఆమానవరూప రాక్షసి వెనుక ఉన్న పాపులు, దుష్ట శక్తులు ఏమి సాధించగలవు?

ప్రపంచానికే ఆధ్యాత్మిక భిక్ష పెట్టిన దని మనం గర్వించే ఈ హైందవ దేశమేనా ఈ పాపానికి ఒడిగట్టింది? దివ్యతేజోరాశి గాంధీ భగవానుని తోడి హిందువుడేనా ఈ హంతకుడు? క్రీస్తు ప్రభువుని చంపుకొన్న యూదుల గతేనా హైందవులకు పట్టనున్నది?

నిఖిలభారతంలోని స్త్రీజాతి మహాత్ముని ఋణమెప్పటికైనా తీర్చుకొనగలదా? ఏ కాలంలోనూ, ఏ మహనీయుడు ఏ ప్రవక్త ఏ దైవాంశ సంభూతుడు చేయని-చేయజాలని మహత్కార్యాలను అణచబడియున్న మహిళాలోక సముద్ధరణను ఈ మానవోత్తముడు సాధించాడే!

ప్రతిసత్యాగ్రహ పోరాటంలోనూ అసూర్యంపశ్యలైనట్టి అసంఖ్యాకులైన స్త్రీలు మహాత్ముని పిలుపులను అందుకొనిరి. స్వాతంత్ర్య పోరాటాలలో స్త్రీల శక్తిని, ధీరత్వాన్ని, దీక్షను, కష్టసహిష్ణుతను ప్రపంచానికి చాటి తమ శక్తిని తాము తెలుసుకొనగల్గెడి వీరనారీమణులను వేలాదిగా తయారుచేసిన దీ మహనీయుడే గదా? స్త్రీకి ఆత్మ విశ్వాసాన్ని కలుగ జేసినదీ, ఆత్మగౌరవాన్ని నేర్పినదీ ఈ జగదేకవంద్యుడే గదా? స్వతంత్ర భారతావనిలో బాపూజీ పర్యవేక్షణ క్రింద మహిళల ఔన్నత్యాన్ని గూర్చి మనం కలలు కన్నాము. అందుకు తగినట్లే భారత స్త్రీ జాతి తండ్రి 'ఆదర్శ స్వతంత్ర భారతావనికి ఒక హరిజన బాలిక పెత్తనం వహించా'లన్నాడు. అట్టి మహిళాలోక సముద్ధారకుని మన మీనాడు కోల్పోయాము. అందుకు విచారపడుతూ రోదనలు చేస్తూ ఊరుకుందామా? వలదు! విచారిస్తూ కాలం గడిపిన మహాత్ముడు సంతసించడు. పని చేయలేకపోతే మరణించు (కరేంగే యా మరేంగే) మన్న బాపూజీ వాక్యాన్ని మనం పాలిద్దాం. మనమంతా ఇదివఱకు బాపూ పిలుపుల నెలా అందుకున్నామో అలాగే ఆయన అడుగు జాడలలో చరిస్తూ ఆయన ఆశయాలను కార్యక్రమాన్ని తూచా తప్పకుండా యావజ్జీవం త్రికరణశుద్ధిగా అనుసరిస్తామని ఈ విశ్వ సంతాప సందర్భంలో ఆయన ప్రియ పుత్రికలమైన మనం పవిత్ర హృదయాలతో శపథం తీసికుందాం. అదే పితృవాక్పరిపాలన.



# మహాత్మునికి శ్రద్ధాంజలి

అనన్య అహింసా మార్గదర్శి, లోకైకపూజ్యుడు, స్థితప్రజ్ఞుడు, భారత మాతృదాస్య శృంఖలామోచకుడు స్త్రీజనోద్ధరణ ప్రియుడు, శాంతమూర్తి, మహాత్ముడు, మన ప్రియ బాపూజీ ఏ హింసను నిర్మూలించుటకు నిరంతరము పోరాడెనో ఆ హింసకే బలియై యావద్భారతావనిని శోక సాగరమున ముంచి, స్వర్గధామము నలంకరించెను.

ఆ లోకారాధ్యునకు దిగదిగంతరాళములనుండి, తప్త హృదయముల తోడ శ్రద్ధాంజలుల నర్పించుచున్నారు. భారతభూమి జనకుని గోల్పోయిన బిడ్డవలె ఆ బాలగోపాలము విహ్వలలై విలపించుచున్నది. మానవులు మానవత్వమనే గోల్పోయి రక్తము నదులై ప్రవహింప హింసింపుచూ స్త్రీలను బిడ్డలను హృదయ విదారకముగ క్రూరబాధల కాహుతి చేయుచుండ ఆ కరుణామయుడు భరింపజాలక 125 ఏండ్లు బ్రతుకనెంచియు హింసా భూయిష్టమగు ఈ దారుణావనియందు జీవించుట కిష్టపడక మరణమునే వాంఛించి రక్షణను తిరస్కరించెను. ఆ మహనీయుడు రాజకీయముగ, ఆర్థికముగ, సాంఘికముగ, నైతికముగ జేసిన కృషి అనన్యము. అపారము. ప్రపంచ మంతయు అచ్చెరువొందునట్లు అహింసా మార్గమున, మాతృభూమిని బలవత్తరమగు పరపాలననుండి విముక్తిజేసి, ఆర్యావర్త ఔన్నత్యమును ప్రకటించెను.

దేశమందు దరిద్ర బాధను పోగొట్టుటకును, ప్రతివ్యక్తికి స్వయంపోషణమున కనుకూలమగునట్లు ప్రతీ ఇంటను రాట్నము పెట్టి వడకునట్లు ఉద్బోధించి జీవనోపాధి మార్గము చూపించెను. విదేశీయ పరిశ్రమల అభివృద్ధికి ప్రచారము చేయించి అసంఖ్యాకులగు దరిద్రనారాయణుకు జీవనాధారమును కల్పించి ఆర్థికాభివృద్ధి గావించెను.

తోటి సోదరుల హైన్యముగ చూచుట అనుచితమనియు జాతిమత వివక్షతలేక మానవులందరు సమానులేయనియు అస్పృశ్యత హిందూధర్మమునకు వినాశకరమనియు, భారత దేశాభివృద్ధికి సర్వమానవ సౌభ్రాతృత్వమే శరణ్యమనియు ప్రబోధించి, భారతీయుల మన స్తత్వమునందే మార్పుకలుగ జేయుటకు అసాధారణ కృషిచేసి హరిజనులకు సాంఘిక రాజకీయములందు సమానమగు పౌరసత్వపు హక్కులను కలుగజేసెను.

హిందూ, మహమ్మదీయ, క్రైస్తవమతముల సారాంశ మొక్కటే యని మానవుల హృదయములందు స్వీయత సామరస్యమును కలుగజేయుటకై మహాజన సమూహమందు ప్రార్థన సభలు జరిపి ఆత్మార్పణ మొనరించెను.

స్త్రీలోక బాంధవుడై, విద్యా విజ్ఞానశూన్యలై తమ సంస్కృతినే మరచి అజ్ఞానాంధకారమునన్న స్త్రీలలో జాగృతిని కలుగజేసెను. అసూర్యంపశ్యలై అబలలైన వారిని సహితము వక్తలుగను, వీరవనితలుగను నొనర్చెను. శక్తి సామర్థ్యములతో శాంతి సమరమందు పోరాడు స్థైర్యమును పెంపొందించెను. మహాత్ముని బోధనల మూలకముగనే స్త్రీలు విద్యావతులై విజ్ఞానవతులై మహిళోద్యమమును ప్రారంభించి నాగరికతకు వన్నెకెక్కిన ఇతర దేశ స్త్రీలవలెనే వివేకముతో తమ హక్కుల కొరకై పోరాడుచున్నారు. స్త్రీలకు విద్యాయోగ్యతను బట్టి ఉద్యోగములు, గౌరవస్థానము లివ్వవలెనని వక్కాణించి, అనేక నారీరత్నములకు గౌరవస్థానము లిప్పించియున్నాడు. అంతియేకాక భారతపార్లమెంట్లు (రాజ్యాంగ పరిషత్తు)నకు హరిజన స్త్రీని అధ్యక్షురాలినిగా చేయుట ఉచితమని వచించియున్నాడు. మాతా కస్తూరీబానిధి మూలముగ దేశమందలి గ్రామగ్రామములలోని అసంఖ్యాకులగు స్త్రీలకు ప్రసూతిచికిత్స, విజ్ఞానము, ఆరోగ్యము మొదలగు సౌకర్యములు కలుగ జేయుటకు తోడ్పడినారు.

శ్రీమతి కొండా పార్వతీదేవిగారు బి. ఏ.

## మహాత్మునికి శ్రద్ధాంజలి

ఎందరో భారత నారీరత్నములు దేశమందును విదేశము లందును కడుసమర్థతతో కార్యభారముల నిర్వహించు చుండుట చూచుచున్నాము. ఆయన అనుచరులై ఆయన వద్ద శిక్షణపొందిన శ్రీమతి సరోజినీ దేవి, విజయలక్ష్మీపండిట్, రాజకుమారి అమృతకౌర్, హంసామెహతా, అనసూయా బాయికలే మొదలగు నారీమణులు గౌరవస్థానముల నలంకరించి దేశదేశములందును తమ సామర్థ్యమునకు కొనియాడ బడుచుండుట జగద్విదితమే గదా!

మన భారత దేశమందు ఇట్టి నారీమణులు బయలు దేరుటకును, మహిళోద్యమ మిట్టి అభివృద్ధిని చెందుటకును మహాత్ముడే మూలకారణుడని చెప్పుటలో అతిశయోక్తిలేదు. అట్టి మన పాలిటి కల్పవృక్షమును గోల్పోవుట మన దుర దృష్టమే. కాని ఆమహనీయు డేమహోత్కృష్ట ఉపదేశముల నుపదేశించెనో ఏ మార్గమున నడచెనో ఆ మహదాశయముల నెరవేర్చుటకు దీక్ష బూనుటయే ఆ మాననీయునికి మన మిచ్చు కృతజ్ఞతాంజలి.

మహిళ లందరు మహాత్ముని ఉద్బోధల కనుగుణముగ సర్వమత సామరస్యము సఖ్యత శాంతి దేశమెల్లెడలను స్థాపించుటకు తీరని కృషిచేసి మహిళాబాంధవునకు శ్రద్ధాంజలు లర్పింతురు గాక.



## రచయితలకు మనవి

అనేక మంది "ఆంధ్రమహిళ"కు ఉత్సాహంతో రచనలు పంపిస్తున్నందుకు సంతోషము. సాధ్యమైనంతవరకు వీటిని ప్రచురించడానికే యత్నిస్తూవుంటాము. ఏ కారణం చేతైనా ప్రకటించ లేకపోయిన సందర్భంలో నిరుత్సాహ పడవలదని మనవి. ప్రచురించబడని రచనలను 0-0-9 తపాల బిళ్ల పంపినచో వాపస్ చెయ్యగలం. కొంతమంది రచనలతోపాటు ఫోటోలు పంపిస్తున్నారు. వీటిని బ్లాకులుగా తయారు చేయించి పంపినపుడుగాని ప్రచురించడం సాధ్య పడదు కనుక గమనింప ప్రార్థితులు.

—సంపాదకురాలు.

# శ్రీ వీరేశలింగం వర్ధంతి

తేది 6-3-48 ని వీరేశలింగం వర్ధంతి కమిటీ సమావేశము జరిగింది. వచ్చేనెల 16, 17, 18 తేదీలలో అనగా శుక్ర, శని, ఆదివారములలో ప్రతిదినము సాయంత్రం 5 గం॥ మొదలు 8-30 గం॥ వరకు పబ్లిక్ మీటింగులు, నాటకములు, ప్రహసనములు, ప్రదర్శించవలసినదని తీర్మానించిరి. నాటకములు ప్రహసనములు శ్రీ పంతులుగారు రచించినవిగా ఉండాలి. ఇందుకుగాను ఒక ఎంటర్‌టైన్‌మెంటు కమిటీ అవసరమనిన్నీ శ్రీ యల్.వి. ప్రసాద్ సినీమా డైరెక్టరుగారు శ్రీ చంద్రబాబుగారు (వెన్నపురి ఆంధ్రమహాసభ శెక్రటరీ) శ్రీ ఘంటపాల వెంకటేశ్వరరావుగారు (మ్యూజిక్ డైరెక్టరు) గార్లతో ఒక కమిటీగా ఏర్పడ వలసిందని కోరడమైనది.

ఖర్చులకును, ఎండోమెంటుకును మదరాసు నగరంలో రు. 7000/- వసూలు కావాలి.

ఇప్పటికి ఇచ్చినవారు:

| | | |
|---|---|---|
| 1. | పి. వి. రాజమన్నారుగారు | 116/- |
| 2. | వి. గోవిందరాజాచారిగారు | 116/- |
| 3. | పి. సత్యనారాయణ రావుగారు | 116/- |
| 4. | బి. గోపాలరెడ్డిగారు | 116/- |
| 5. | పి. బ్రహ్మయ్యగారు | 116/- |
| 6. | సి. హెచ్. సుబ్బారావుగారు | 50/- |
| 7. | బి. సి. మురారి రత్నంనాయుడుగారు | 50/- |
| 8. | ఒ. పుల్లారెడ్డిగారు | 51/- |
| 9. | యం. వెంకటసుబ్బారావుగారు | 51/- |
| 10. | యం. కళ్యాణస్వామిగారు | 10/- |
| 11. | డాక్టర్ యన్. వి. శర్మగారు | 10/- |
| 12. | డి. వెంకటేశ్వర్లుగారు | 10/- |
| | మొత్తము | 812/- |

విరాళములను శ్రీ కె. కళ్యాణస్వామిగారు
5 నల్లన్న మొదలీ వీధి
రాయపేట, మదరాసు.
అడ్రస్సుకు పంపప్రార్థన.
ఇతర విషయములకు బిజినెస్ కమిటీ
11 అరుళమ్మాళ్ వీధి
త్యాగరాయనగరు, మదరాసు.
వ్రాయండని మా మనవి.

(for) దరిశి చెంచయ్య
బిజినెస్ కమిటీ



## గ్రంథ సమీక్ష  శ్రీమతి మామిడిపూడి వైదేహి

**శ్రీ మహర్షి జీవిత కథామృతము :**

గ్రంథకర్త—శ్రీ బులుసు వెంకటేశ్వర్లు బి. ఏ., రామారావుపేట, కాకినాడ— వెల రూ. 2-0-0.

శ్రీ బులుసు వెంకటేశ్వర్లుగారు మహాపురుషుల చరిత్రలు మంచి భక్తి—జ్ఞానదాయకములుగా రచించ నేర్చిన నేర్పరులగుటచే ఆంధ్రులకు చిరపరిచితులే.

మహాఋషుల జీవిత ఘట్టాల్ని అక్కడక్కడ చెదురుగా చదవడమేగాని, అవి మన కొక గ్రంథరూపముగా లేక పోయెనన్న కొరత వీరు అమోఘంగా తీర్చేరు. శ్రుతిస్మృతి పురాణేతి హాసాదులనుంచి వీటిని యేర్చి, కూర్చి మనోహరమైన గ్రాంథిక భాషలో ప్రాచీన భారతవర్ష మహర్షుల జీవిత చరిత్రల్ని రెండు భాగాలుగా ముద్రించేరు. ప్రథమ భాగములో అగస్త్య, అత్రి, అష్టావక్ర, ఋష్యశృంగ, కపిల, కశ్యప, గౌతమ, చ్యవన, జమదగ్ని, దత్తాత్రేయ, దధీచి, దుర్వాస మహర్షుల జీవిత చరిత్రలు, వారి బోధలు సంక్షేపంగా 173 పేజీల్లో వివరించేరు.

క. "ఎరుకగలవారి చరితల
గరచుచు సజ్జనుల గోష్ఠిఁగదలక ధర్మం
బెరుగుచు, నెరిగిన దానిని
మరువకనుష్ఠించునది సమంజస బుద్ధిన్"

అని పెద్దలన్నారు గనుక—అందరూ, ముఖ్యంగా స్త్రీలు ఆధునిక మహాపురుషుల చరిత్రలతో బాటు ప్రాచీన భారత వర్ష మహర్షుల వాక్యాలే మన కనుష్ఠేయాలు గాని వారి చర్యలు మన మనుకరించరాదు, అనుకరించలేము.

"నానుష్ఠేయంతు తత్సర్వం । మునిభిర్య దనుష్ఠితమ్ ।
వాక్యమే వానుకర్తవ్యం । పండితైః పరమోమతః ॥

**కాశ్మీర్ :**

ఎడిటర్ : టి. కె. రామస్వామి—ప్రకాశకులు—ప్రజాశక్తి ప్రచురణాలయం—బెజవాడ— వెల 0-4-0.

ప్రజాశక్తి ప్రచురణాలయం వారు ప్రస్తుతము ప్రజలను ఆకర్షిస్తున్నటువంటి గడ్డు సమస్యలను సంగ్రహముగ, క్లుప్తముగా ప్రకటించుచున్న చిన్న పుస్తకములలో 'కాశ్మీర్' ఒకటి. స్వతంత్ర భారతదేశము ఎదుర్కొనవలసిన సమస్యలలో కాశ్మీర్ సమస్య యొకటి. హిందూదేశములోని స్వదేశ సంస్థానాలలో కాశ్మీర్ ఒకటి. ఇందు 40 లక్షలమంది ప్రజలున్నారు. బొగ్గు,కలప, పెట్రోలు, ఇనుము ఇచ్చట విస్తారముగా దొరుకును. కాని సంస్థానము మాత్రము దారిద్ర్యావస్థలోనున్నది. దీనికి కారణములేవో గ్రంథకర్త ఈ పుస్తకములో వివరించియున్నాడు. మరియు ఇటీవల ఇప్పుడు కూడ కాశ్మీర్‌లో జరుగుచున్న దుండగాలు అందుమూలముగా పాకిస్థాన్, హిందూదేశములకు మధ్య జరుగుచున్న సంఘర్షణ, పరిష్కార్థము ఐక్యరాజ్య సమితి చర్చ జరుపుట, మొదలైన విషయములుకూడ ఈ చిన్న పుస్తకములో వివరింపబడి యున్నవి.

**శాంతమూర్తి :**

గ్రంథకర్తలు : విద్వాన్ అష్టావధాని అల్లసాని రామనాథశర్మ, విద్వాన్ దండిపల్లి వేంకటసుబ్బశాస్త్రి—పబ్లిషర్ : టి. బాలనాగయ్యశెట్టి బాలసరస్వతీ బుక్‌డిపో, కర్నూలు. వెల 0-12-0.

శాంతమూర్తి అయిన ధర్మరాజు జననము,అతని బాల్యము దుర్యోధనుని దురాలోచనలు, ద్రౌపదితో వివాహము, రాజసూయాధ్వరము మాయాద్యూతము, పాండవ వనవాసము, ధర్మరాజుని దయాళుత్వము, అజ్ఞాతవాసము, కృష్ణసంజయ రాయబారములు,కురుక్షేత్ర యుద్ధము, భీష్ముని సమరము, కర్ణయుద్ధము, దుర్యోధనుని మరణము, అంత్యక్రియలు, ధర్మరాజు పట్టాభిషేకము మొదలైన ఘట్టములన్నియు గ్రంథకర్త ఈ పుస్తకములో వివరించియున్నాడు. ధర్మరాజును మూలముగా గొని భారత కథనంతను సంక్షిప్తముగ చిన్న పిల్లలకు విద్యార్థులకు ఉపయోగపడునట్లు ఈ పుస్తకము వ్రాయబడియున్నది.

చిత్ర సమీక్ష

# బాలరాజు

ఇంద్ర సభలో నృత్యము చేయమని ఆజ్ఞాపించిన దేవేంద్రుని మాటను తిరస్కరించి, మోహిని తన ప్రియుడైన ఒక యక్షునితో మానవ జన్మమెత్తి ఫలించని ప్రేమతో అల్లాడునట్లుగా శాపము బొందెను.

యక్షుడు వెలమవారింట పుట్టి బాలరాజై పెరుగుచుండెను. మోహిని కమ్మనాయుడికి నాగేటిచాలులో దొరికి సీతమ్మగా పెరిగెను. సీత దొరికినప్పటినుండియు కమ్మనాయుడికి బాగా కలిసివచ్చినందువల్ల, పెళ్లియీడు వచ్చిన సీతకు పెండ్లిచేసిన సీతతోపాటు తన ఐశ్వర్యమంతయు పోతుందని బెదిరి, సీత పెండ్లిమాటయే తలపెట్టలేదు. పైగా ఆమెను ఊరి వెలుపల నరులకంటబడకుండా ఒక ఒంటి స్తంభం మేడలో పెంచుచుండెను.

ఒకనాడు బాలరాజు చెలికాడు యెల్లమంద ఆ యింటి దారినే వెళ్లుచుండగా సీత చూసెను. బాలరాజు పిల్లనగ్రోవి ఊదుకొంటూ ఉంటూండగా ఆ పాట విని సీత మైమరచి, ఇల్లు విడచి బాలరాజును కలిసికొంది. ప్రేమ అన్న ఏమో తెలియని బాలరాజు ఇదొక పెద్ద పీడగా ఉందని సీతను విడిచిపెట్టి వెళ్లుటకు అనేకసార్లు ప్రయత్నము చేసెను. అనేక దొంగ ఎత్తులుకూడ వేసెను. కాని ఆమె వారిని వెంటాడియే వచ్చుచుండెను.

ఆరాత్రి వారిద్దరునిదురపోవుచుండగా అడవిలోదొంగలు మత్తుమందుజల్లి సీతను తీసుకెళ్లారు. మరుసటి ఉదయము నిద్రలేచేసరికి సీత లేనందువల్ల ఆమెను వెతుక్కుంటూ అతను అడవులపాలై మునీశ్వరుని శాపమువల్ల పామై సీతను వెతుక్కుంటూ పోవుచుండెను. సీత ఎట్లాగో దొంగల బారినుండి తప్పించుకొని పామైన బాలరాజును చేరి తీర్థయాత్రలుచేసి, మళ్లీ బాలరాజును చేరుకొంది.

కాని అంతటితో వారి కష్టములు గట్టెక్కలేదు. ఇంద్రుడు అనేక విధముల అనేక రూపములతో వారి ప్రేమబంధములను తెగగొట్టుటకు ప్రయత్నించి చివరకు అతనిని చంపెను. సీత ఇక కోపము సహించలేక ఇంద్రుణ్ణి శపించబోవు సమయములో శివుడు దేవతలు దిగివచ్చి బాలరాజును బ్రతికించి ఇంద్రుణ్ణి క్షమించమని వేడిరి. బాలరాజు బ్రతుకుట చేత సరేనన్నది. క్రొత్త దంపతులను దేవతలు స్వర్గానికి రమ్మన్నారు. ప్రేమను గౌరవించని ఆ స్వర్గముకంటే ఈ భూతలస్వర్గమే మాకు చాలని సీత నిరాకరించింది. సీత బాలరాజులు చిరంజీవులై భూమిమీదే సుఖంగా కాలంగడుపుతూ ఉండిపోయారు.

ఇదీ, 'బాలరాజు' గాథ. ఇందు వరలక్ష్మి సీతగాను, అంజలీదేవి మోహినిగాను, నాగేశ్వరరావు బాలరాజుగాను పాల్గొన్నారు. నాగేశ్వరరావు తన నటనాకౌశల్యమంతయూ ఇందు చూపించి ప్రేక్షకులను మైమరపింప జేసెను. వరలక్ష్మి గానము ముఖ్యముగా మెచ్చుకొనవలసియున్నది. ఎల్లమంద హాస్యము మిక్కిలి చక్కగానున్నది. కాని ఒకప్పటికి తెంపు లేకుండా కథను అనవసరముగా పెంచడమే ఈ చిత్రములోని పెద్దలోటు.



# ఐక్యరాజ్య సమితి

రాజ్యమునకు, రాజ్యమునకు వివాదములు సంభవించినపుడు, వాటినిగురించి చట్టబద్ధమైన తీర్పుచెప్పుటకుగాను, సమితివారు, అంతర్జాతీయ న్యాయస్థానము నొకటిని స్థాపించియున్నారు. ఇది ఐక్యరాజ్య సమితియొక్క అంగములలో నొకటి. ఇందు పదునైదుగురు న్యాయమూర్తులు కలరు. వీరందరు అంతర్జాతీయ న్యాయశాస్త్రమునందు పేరు పొంది, నానాదేశములకు చెందినవారు. వీరిని మహాసభవారు, భద్రతా సంఘమువారు వేరువేరుగ కూర్చొని ఎన్నుకొనెదరు. తొమ్మిది సంవత్సరముల కొకపర్యాయము వీరి ఎన్నిక జరుగును. ఏ రెండు రాజ్యములైనను తమవద్దకు వచ్చి, వారి వివాదములను తీర్చుమని అడిగినయెడల, అట్టి వివాదములను పరిష్కరించుటకు దీనికి అధికారము కలదు. సంధి షరతుల విషయము గురించిగాని, మరేదైన నిబంధనల గురించిగాని అనుమానము వచ్చినయెడల, అట్టి అనుమానమును తీర్చుటకుకూడ దీనికి హక్కుగలదు. న్యాయముగా, అన్ని విషయములను పరిష్కరించగలిగినయెడల, యుద్ధముల నరికట్టి, శాంతిని నెలకొల్పుటకు, ఈ ఒక్క అంగమే చాలును.

ఇవిగాకుండ, ధర్మకర్తృత్వసభ అను ఒక అంగముకూడ సమితివారు స్థాపించియున్నారు. ప్రపంచమునందు వెనుకబడిన దేశములను పాలించుచున్న ప్రభుత్వములవారు, న్యాయముగాను, ప్రజల శ్రేయోభివృద్ధి నుద్దేశించి పరిపాలనము గావించుచున్నారో లేదో చూచుటయే ఈ సభయొక్క ముఖ్యోద్దేశము.

ఇన్ని సలక్షణములు గల్గిన సమితి సక్రమముగ పనిచేయగలిగినయెడల, ప్రపంచమున శాంతిని నెలకొల్పగలదనుటలో సందేహములేదు.



## మా బావుటా!!!

**శ్రీమతి కామేశ్వరి దీక్షి**

ఎగరాలి-ఎగరాలి
మా బావుటా! మా ధర్మచక్రంపు బావుటా ॥
బావుటా! బావుటా! బావుటా!

తొలిఉషస్సులలోన
చిలుకనవ్వులతోడ
ఆకాశవీధిలో
అందాలుచిందుతూ
ఎగరాలి ॥

నవ్వుభారతవీధి
దివ్యభావుకులతో
కలకలలాడంగ
కిలకిలానవ్వుతూ
ఎగరాలి ॥

ఖండఖండాలుగా
ఖండింపబడినట్టి
ఇండియా ఖండాన్ని
ఏకఖండముజేయ
ఎగరాలి ॥

ఎల్లదేశాలకున్
ఎదురుగానిలుచుండి
శాంతిసందేశంబు
సర్వదాచాటుతూ
ఎగరాలి ॥

ఆసియాఖండాన ఆదర్శప్రాయమై
భారతభూమియే ప్రభవించునట్లుగా
ఎగరాలి! మా బావుటా! ఎగరాలి

# చెడావుల ముచ్చట

సాధారణంగా ఒక్కొక్కరికి ఒక్కొక్క సరదా వుండటం కద్దు. సరదాలు, ముచ్చటలు అనేవి వారివారి రుచుల కనుగుణంగా వుంటూంటాయి. వారివారి స్వభావాలను బట్టి, రుచులను బట్టి మారుతూవుంటాయికూడా. నాకు చాలా రోజులనుంచీ, హిందూస్థానీ స్త్రీలు ధరించే పాద రక్షలలాంటివి వేసుకోవాల నిచాలమనసుగా వుండేది. వాటినే చెడావులంటారు. నాకు అలాంటి సరదా ఎట్లాకలిగిందంటే, నేను చెడావులను ఒక హిందూస్థానీ స్నేహితులయింట్లో చూచాను వెంటనే నేను ఆ స్నేహితురాలిని చెడావులెక్కడ కొన్నారని అడిగాను. దానికి ఆమె యిటువంటివి యిక్కడ దొరకవని, ఉత్తర హిందూదేశంలో (ఢిల్లీ, కలకత్తా)నే దొరుకుతాయని చెప్పింది. దానితో నేను కొంచెం నిరుత్సాహపడ్డ మాట నిజమే. నేను ఆ చెడావులనే ముహూర్తాన చూశానో కాని అవి నన్ను చాలా ఆకర్షించాయి. చక్కని జరీపనితో, ఆకర్షణీయమైన రంగుతో, మంచి ముఖమల్ లెదరుతో ముద్దులొలుకుతూయున్నాయి.

నేనంతటితో వొదిలి పెట్టలేదు. ఆమెను, చెడావులు తమ దేశం నుంచి తెప్పించగల దేమోనని అడిగాను. కాని వాళ్ళ వాళ్ళెవరూ అప్పట్లో ఢిల్లీ వెళ్లరని చెప్పింది. నేను యింటికి వచ్చానన్న మాటేగాని, నా మనస్సంతా చెడావుల మీదనే వుంది. ఇక్కడ ఇంత అందమైన బర్మా శాండల్స్, బాటా జోళ్ళు, హైహీల్సు అన్నీ వుంటే ఎక్కడో అందని పండ్లకోసం చూస్తుందేమిటా అని మీరు ఆశ్చర్య పడవచ్చు కాని చెడావులాకర్షించినట్లు నన్ను మరే యితర ఆకర్షించలేదు. ఎప్పటికయినా వారిని కొనుక్కొని తీరాలని పట్టుదల కలిగింది.

ఇట్లావుండగా ఆ మధ్య మా నాన్నగారు ఏదో పని మీద ఢిల్లీ వెళ్ళవలసివచ్చింది. ఇంక చూసుకోండి నా సంతోషం నిజంగా చెడావులను కొనుక్కున్నంత సంబరమైంది. ఇంత కాలానికి చెడావులను కొనుక్కొనే యోగం పట్టింది కదా అని మురిసిపోతూ, నా కోరికను మా నాన్నగారితో చెప్పాను. అసలు మా నాన్న చాలా మంచి వారు. నేనేదడిగినా మారు చెప్పేవారు కారు. కొండమీద కోతి నన్నా సరే తెచ్చియిచ్చేవారు. ఆయన చెడావులే కదటమ్మా తెస్తానన్నారు. కాని మా అమ్మ అడ్డొచ్చి ఏమిటే పులిని చూసి నక్క వాత పెట్టుకుందన్నట్లు ఆ చెడావులు హిందీ వాళ్ళకే సరిపడ్డాయి కాని; వాట్లతో నువ్వెలా నడవగలవే, డబ్బు దండుగ కాని అని ఓ అడ్డు పుల్ల వేసింది. దానితో నాకు చెప్పలేనంత కోపము, దుఃఖము వచ్చింది. అది చూసి మా నాన్న అమ్మతో పోనియ్యవే యింతలో మునిగి

శ్రీమతి మొసలికంటి శాంతగారు

పోయిందేమిటి, అది సరదా పడుతూంటే అన్నారు. దానికి నేనెంత సంతోషించానను కున్నారు? మనస్సులో మా నాన్నగారిని ఎంతో పొగడుకున్నాను.

సరే! నాన్నగారి ప్రయాణపు రోజువచ్చింది. ఆక్రితం రోజే నా కాలి ఆది జాగ్రత్తగా పేపరు మీద వేసివుంచాను. నాన్నగారు చెప్పిన ప్రతి పనీ ఎందో శ్రద్ధగా చేసాను. నాన్నగారిని రైలెక్కించేందుకు, స్టేషనుకు వెళ్ళాము. రైలె క్కాక మరొక సారి, చెడావుల మాట మర్చి పోవద్దని నాన్నగారిని హెచ్చరించాను. తరువాత స్కూల్లో స్నేతులందరితోనూ, నాన్నగారు ఢిల్లీనుంచి చెడావులు తెస్తారని చాటే శాను. నాన్న వారం రోజులదాకా రారు. అబ్బా! వారం రోజులెలా గడపటం అని బాధ పడ్డాను. ఎప్పుడు చెడావులు తెస్తారా, ఎప్పుడు తొడుక్కుందాం అని వేచివున్నాను. నాన్నగారు వచ్చినట్లు, అందమైన చెడావులు తెచినట్లు రోజూ కలలే. అందులోనూ తెల్లవారగట్ల వచ్చే కలలు నిజమవుతాయని నాకు చాలా నమ్మకం. అం[illegible]ందు కలలంటే ఏమిటో ఎరుగని [illegible]డావుల సందట్లో రోజూ కలలే.

మరి వారం రోజులు గడిచాక నాన్నగారు వచ్చారు. చెడావులుకూడా తెచ్చారని వేరే చెప్పక్కర్లేదు. అవి చూసుకుని నేనెంతో మురిసిపోయాను. మంచి ముఖమల్ గుడ్డతో తోపురంగుతో, జరీతో చాలా అందంగా వున్నాయి. ఇంటికి వచ్చిన వాళ్ళందరికీ చూపించాను మా తమ్ముడు అవి చూసి చాలా ఉడికి పోయాడు. ఎలాగయితేనేం. నా ముచ్చట తీరింది.

అయితే కొనగానే సరా! వాట్లతో నడవటం అలవాటవద్దూ? కాలికి తొడిగి చూస్తే ఆరు జోళ్ళ (స్లిప్పర్స్)లా లేవు. కొంచెం బిగువుగాను అసౌకర్యంగానూవున్నాయి. నేనంతతో నిరుత్సాహపడలేదు. ఇంట్లో తొడుక్కు నడుస్తే అలవాటవుతుంది గదా అని, చెడావులు తొడుక్కుని యిల్లంతా, దొడ్లోనూ తిరగడం మొదలెట్టాను. అది చూసి మా అమ్మ, కోతికి కొబ్బరికాయ దొరికినట్లు, ఆదేమిటే అని సాధించడం ప్రారంభించింది. చెడావులతో నడవటం సరదాగానే వుంది కాని, అలవాటులేక అడుగు ముందుకి పడదు. ఇంక మా తమ్ముడు, బాగా అయిందిలే శాస్తి అని వెక్కిరించడం మొదలెట్టాడు. దాంతో నాకు ఉక్కురోషంవచ్చింది. కాని పైకి కనపడకండా ఎట్లాగో అణుచు కున్నాను. ఎవన్నా అంటే నాకేగా నెత్తికి చేతులు వచ్చేది మరి? నాన్నగారది చూసి, రెండురోజులు పోతే అలవాటవుతుందమ్మా అని ఓదార్చారు.

తరువాత రెండు రోజులు కాదు, నాలుగు రోజులు గడిచాయి. అయినా అలవాటవలేదు. అవి వేసుకుంటే కాలికి బాధకలిగేది. అయినా, వాటి అందం చూసుకుని మురిసి పోయేదాన్ని తరువాత నా స్నేహితురాండ్రొకళ్ళిద్దరు చెడావులు తెస్తారన్నావు ఏదో అన్నావు ఏవి? అన్నీ

గొప్పలే అని చెప్పడం మొదలెట్టారు. ఇంక వేరే గత్యంతరం లేక ఒక రోజు అవి చూప డానికి నిశ్చయించాను. వెళితే తొడుక్కునే వెళ్ళాలి. పేపర్లో కట్టి తీసుకెడితే నవ్వుతారని భయం. వాట్లతో నడవడం గండంగావుంది. సరే యేమైతే అవుతుందని తొడుక్కుని వెళ్ళ డానికే నిశ్చయించాను. ఆ రోజు అమ్మ వద్దం టూన్నా వినకండా చెడావులు తొడుక్కుని స్కూలుకి బయలుదేరాను. మా యింటినుంచి బస్సుస్టాండు దాకా 1½ ఫర్లాంగుల దూరం వుంటుంది. తరువాత బస్సుదిగి మరోకొంచెం దూరం నడవాలి. రిక్షాలరుదుగా వుంటాయి. చెడావులతో గేట్లోంచి రోడ్డు మీదకే అడుగు పడదు. ఇంత దూరం ఎలా నడవనురా బాబూ అని భయమేసింది. కాని మరి తప్పదుగా! నడ వడం మొదలెట్టాను. బొటన వ్రేళ్ళు రెండూ మెలికపడ్డాయి. కాలంతా అందులో యిరుక్కుని బాధగావుంది. అడుగు పడటంలేదు. అయినా మొండికెత్తి బరువుగా అడుగులేస్తూ నడిచాను. సగం దూరం నడిచేటప్పటికి ఆయాసం మొద లెట్టింది. ఐనా, పట్టుదలవలన ఎట్లానో కష్టపడి స్కూలుకి జేరాను. నా చెడావులు నా స్నేహితు లందరూ చూచి చాలా బాగున్నాయన్నారు. దానితో నా ముఖం విప్పారింది. బాధంతా మర్చిపోయాను.

కాని అప్పుడే అయిందీ? మరి ఓచ్చే టప్పుడో అదేమి శాపమో కాని ఒక్కా రిక్షా యైనా కనపడలేదు. నా కాళ్ళ బాధ ఎక్కువైంది. అలాగే కుంటుకుంటూ బస్సుమీద ఆళ్వార్ పేట జేరాను. ఇంక అక్కడ నించి ఇంటికి జేరే టప్పటికి తలప్రాణం తోకకొచ్చింది. నిజంగా ఏడుపొచ్చింది. జోళ్ళు విప్పేసి చేత్తోపట్టుకు నడుస్తే ఎవరైనా చూసి నవ్వుతారని భయం. ఎట్లాగో యింటికి జేరాను. పాదాలు వాచి ఎఱ్ఱగా అయిపోయాయి. నడుస్తే విపరీతమైన నొప్పి బొటనవ్రేళ్లు పుండు అయిపోయాయి. నా స్థితి చూసి మా అమ్మ తిట్టడం మొదలెట్టింది. బంధువులంతా నవ్వడం ఆరంభించారు. రెండు రోజులు కాలు కిందపెట్టలేక పోయాను. అమ్మ మాట వినకండా ఎందుకు తొడుక్కున్నానురా భగవంతుడా అని పశ్చాత్తాపపడ్డాను. నా చెడాల ముచ్చట అలా తీరింది. ఇప్పటికీ అవి పెట్టెలోనే వున్నాయి. కొత్తగా, అందంగా, ముద్దొస్తూను. ఉపయోగిస్తేగా మరి?





# రాజకీయాలు

## 1947 రాజకీయముల సింహావలోకము

1947 వ సంవత్సరము మన దేశమునకు మిక్కిలి భాగ్యప్రదమైన సంవత్సరము. మన దేశమును నిజముగ మన దేశమని రొమ్ముమీద చేయి వేసికొని చెప్పుకొనగల భాగ్యము మనకు లభించినది. ఇన్నాళ్లూ 'భారతభూమి మనదే కాని ఫలితము మనకేదీ', అని ఆర్తనాదము చేయుచుండిన మనము ఇకమీదట ఆ విధముగా అలమటించవలసిన అవసరము ఎంత మాత్రము లేదు.

గత సంవత్సరము ఫిబ్రవరి మాసమునందు కాంగ్రెసు, ముస్లింలీగు పార్టీలమధ్య సంబంధము మిక్కిలి గడ్డు పరిస్థితి యందుండెను. ఇరు పక్షములతో ఏర్పడ్డ సమిష్టి ప్రభుత్వము పని చేయుచున్నప్పటికినీ, అప్పటికే సమావేశములోనున్న రాజ్యాంగ సభలో, ముస్లింలీగు ప్రతినిధులు పాల్గొనుటకు నిరాకరించిరి. వాతావరణము చాలా ప్రతికూలముగనుండెను. ప్రభుత్వ వ్యవహారములన్నియు స్తంభించి పోవుటకూడ సంభవించినది. పరస్పర విరుద్ధ భావములతో, ఐక్యతకు వ్యతిరిక్తముగా నడుచుచున్నటువంటి లీగు పక్షము వారికి, బ్రిటిష్ ప్రభుత్వము యొక్క సహకార ముండుట చేత కాంగ్రెసు తమ సమైక్యతా సిద్ధాంతమును బలపరచలేక పోయిరి. ఈ విషయమును గమనించి బ్రిటిష్ రాజకీయవేత్తలు దేశమును విడిచి పెట్టి వెళ్లుటయే మంచిదని తీర్మానించిరి. లండనుకు మన నాయకులను రప్పించి సంప్రదింపులు చేసిన పిమ్మట తాము నిష్క్రమించుటకు పూనుకొనిరి. లార్డువేవెలు గవర్నరు జనరల్‌గా ఉన్న సమయములో, 1948 వ సంవత్సరము జూన్ 1 వ తేద బ్రిటిష్‌వారి నిష్క్రమణకు గడువని నిర్ణయింపబడియుండెను. అట్లుగాక, అట్లీ ప్రధాని ఆ గడువుకాలమును రద్దుచేసి, అంతవరకు మనదేశ స్వాతంత్ర్యమునకు పెద్ద అడ్డంకిగానుండిన లార్డువేవెలును ఇంగ్లండుకు పిలిపించి ఆయన స్థానే లార్డు మౌంటుబేటన్‌ను పంపెను. మౌంటుబేటన్ మన నాయకులతో సంప్రతింపులు జరిపి ఆగస్టు 15 వ తేదీ నాటికే బ్రిటిష్‌వారు మన దేశమును విడిచి వెళ్లునట్లును, దేశమును హిందూస్థాన్, పాకిస్థాన్ అను రెండు భాగములుగా విభజన చేయుటకును ఏర్పాటులు గావించెను. దీనిని అనుసరించి, బ్రిటిష్ పార్లమెంటు ఇండియా స్వాతంత్ర్య చట్టము నొకదానిని శాసించి 15 వ తేదీన వారి అధికారమును భారతీయుల పరమును గావించిరి. దీని ఫలితముగ పశ్చిమపంజాబు, సింధు, వాయువ్యసరిహద్దు రాష్ట్రము, తూర్పు బెంగాల్ ముస్లింలీగు వారికిని మిగతా భాగమంతయు ఇండియన్ యూనియన్‌కు చెందును. పాకిస్థానుకు జిన్నా గవర్నరు జనరల్‌గా నియమింపబడెను. ఇండియా ప్రభుత్వము బ్రిటిష్ ప్రభుత్వమునకు గౌరవము చూపదలంచి, ఇదివరకు గవర్నరు జనరల్‌గానున్న లార్డు మౌంటుబేటన్నే ఆ స్థానమునకు ఎన్నుకొనిరి. కాని పూర్వమువలె అతనికి ఎటువంటి అధికారమును లేదు. కార్యనిర్వాహక సభ్యుల ననుసరించియే ప్రతి పని చేయవలసియున్నది. కనుక నామకార్థము అతను పదవిలో నుండెను. దీని మూలమున మనకు రాజకీయ దాస్యముతొలగి స్వాతంత్ర్యము లభించెను. కాని, దీనితోపాటు, దేశవిభజన జరుగుట మిక్కిలి విచారకరమైన విషయము.

* * *

## స్వదేశ సంస్థానములు

దేశ విభజన విషయములో స్వదేశ సంస్థాన విషయము కూడ ఆలోచించవలసియున్నది. ఆగస్టు 15 వ తేది నాటికి మన దేశములో రమారమి 600 సంస్థానములుండెను. అవన్నియు బ్రిటిష్ ప్రభుత్వముతో వేర్వేరుగా సంధిషరతులను

చేసికొని యుండెను. బ్రిటిష్‌వారు మన దేశమునుండి తొలగిపోయిన తర్వాత వారికి సంపూర్ణ స్వాతంత్ర్య మొసంగిరి. వారి వారి ఇష్టాను సారముగా ఇండియాలో గాని. పాకీస్థానులోగాని చేరుటకును, లేక ఎందులోను చేరక స్వతంత్ర్యముగానుండుటకును వారికి అధికారము కలిగెను. పెక్కు సంస్థానములు సంప్రతింపులుగావించి వాటిలో అనేకములు ఇండియన్ యూనియన్‌లోను, కొన్ని పాకిస్థానులోను చేరెను. కాని, హైదరాబాదు, జునాఘడ్, కాశ్మీరము మున్నగు సంస్థానముల గురించి కొన్ని చిక్కులు సంభవించెను. అవి స్వతంత్రముగ నుండుటకు ప్రయత్నించుచుండెను. కాని దేశములో అన్ని స్వతంత్ర రాజ్యము లుండుట క్షేమకరముగాదని ఇండియా ప్రభుత్వమువారు గమనించి, నవంబరు 29 వ తారీఖున హైదరాబాదుతో యొక యథాతథపు ఒడంబడికను చేసుకొనెను. జునాఘడ్ సంస్థానములో హిందువులు అధిక సంఖ్యాకులుగానున్నారు. కాని ఆ సంస్థానాధీశ్వరుడు ప్రజాభిప్రాయమును పాటించక పాకిస్థానులో చేరెను. వెంటనే అతనిపై ప్రజలు తిరుగబడి, వేరే ప్రభుత్వమును స్థాపించుటకు సంసిద్ధులగుటచేత, అతడు ఆ సంస్థాన పరిపాలనముకూడ మన ప్రభుత్వమునకే ఒప్పగించెను. ఇందుకు ప్రతిఫలముగా పాకీస్థాను ప్రభుత్వము కాశ్మీరమును తమ యధీనము చేసికొనదలచి, కొండజాతులకు సహాయముచేసి వారిని కాశ్మీరముపై దండెత్తి పురికొల్పిరి. దండయాత్రలు సలిపిరి. కాశ్మీర సంస్థానాధీశ్వరుడు, తనకు ప్రజా సహకారము లేదనియు, తననిస్సహాయతను ఎఱింగి. గత్యంతరములేక ఈ క్లిష్ట పరిస్థితిని ఎదుర్కొనుటకుగాను, ప్రజా ప్రతినిధి అయిన షేక్ అబ్దుల్లాను రాజ్యాధికారమునకు రప్పించి కాశ్మీరమును ఇండియన్ యూనియన్‌లో చేర్చెను. కాని యుద్ధము మాత్రము జరుగుచునేయున్నది. కాశ్మీరము తప్ప తక్కిన సంస్థానముల సమస్య ఏదో విధముగ పరిష్కారమైన దనియే చెప్పవచ్చును.

*          *          *

## అంతర్జాతీయ రాజకీయములు

అంతర్జాతీయ రాజకీయ విషయములుకూడ చాలా అయోమయముగనున్నవి. జర్మనీ సమస్య ఇంకను పరిష్కారము కాలేదు. అగ్ర రాజ్యముల నలుగురి మధ్య, ఎటువంటి పొత్తు కుదరలేదు. వారిలో వారికి భేదాభిప్రాయములు నానాటికి హెచ్చుచున్నవి. ముఖ్యముగా రష్యా, అమెరికాల మధ్య వైషమ్యము తీవ్రరూపము ధరించుచున్నది. అమెరికా, పశ్చిమ యూరప్‌కు ఆర్థికముగ సహాయముచేసి అంగుచూలమున కొన్ని సైనిక ఆశ్రయములను పలుకుబడి సంపాదించుకొనవలెనని కోరికతో మార్షల్ ప్రణాళికను ప్రతిపాదించినది. ప్రెసిడెంటు ట్రూమెన్ గ్రీసు దేశమునకు టర్కీకి 400 మిలియన్ల డాలర్లు అప్పు ఇచ్చుటయే కాక, అమెరికన్ సేనలనుకూడ యూరప్‌కు పంపినాడు. రష్యా మరియొక ప్రక్క యూరప్‌ను తన అధీనము చేసుకొని కమ్యూనిస్టు రాజ్యమును స్థాపించుటకు ప్రయత్నము గావించుచున్నది. ఇందువల్ల అంతర్జాతీయరంగములో పరిస్థితులు ఇదమిత్థమని ఇంతవరకు తేలలేదు. ఇటలీ దేశముతో నామకఃసంధి చేసుకొని నప్పటికీని ఇటలీ వలసరాజ్యముల సంగతి ఇంకను తేలలేదు. మెడిటరేనియన్‌లో, కాపిటలిస్టులకు, కమ్యూనిస్టులకు గల పోరాటము శాంతమయినగాని యూరపులో ఉండు అన్ని వ్యవహారములు పరిష్కారము కాజాలవు. అందుచేతనే 1947 లో అగ్రరాజ్యాల విదేశాంగ ప్రతినిధులు మాస్కోలోగాని, పారిస్‌లోగాని, లండనులో గాని సమావేశమైనప్పుడు, ఎటువంటి నిర్ణయమునకు రాలేక భగ్న హృదయులై తమ ఇండ్లకు మరలిపోయిరి.

1948 వ సంవత్సరమున, 1947 వ సంవత్సరమున పరిష్కారము కాలేని సమస్యలు ఎంతవరకు పరిష్కారము కాగలవో చెప్పుట కష్టము. అగ్రరాజ్యముల మధ్య పొత్తు కుదరనపుడు ఐక్యరాజ్య సమితి మాత్రము శాంతి స్థాపన నెలకొల్ప గలదు! భవిష్యత్తు భగవధాధీనము కదా!



# దూరసీమల నారీప్రపంచం

అమెరికాలోని స్త్రీలెట్లు సంసారములోను సంఘములోను కోశాధిపతులైరో గమనిద్దాం.

మొదటి ప్రపంచ యుద్ధానంతరము స్త్రీ సంఘమునకు నవీనకాంతులు కలిగినవి. అందులోను అమెరికన్ స్త్రీల ప్రాముఖ్యత హెచ్చినది. స్త్రీ స్వాతంత్ర్యమునకు పుట్టినిల్లు అమెరికా అని తేలింది. ఆర్థికముగా సాంఘికముగా, రాజకీయకముగా అమెరికన్ నారీమణులు వారి ప్రత్యేక ప్రాముఖ్యతను స్థాపించిరి. స్వామి వివేకానంద యంతటి ఆయనగూడ వారి అమెరికా ప్రచారములో ముఖ్యముగా గమనించినది అచ్చటి స్త్రీలలోని నవ్యశక్తి. వారి అధీనములో అమూల్యమైన ధనముండినది. వారు పట్టినదిపట్టు. పెట్టినది బిక్ష. ఏ యుద్యమమైనను వారి సహాయ్యములేనిదే పెగ్గదు. వారు చేయూతయొసగిన ఏ విషయమైనను జయప్రదముగా నడచును. క్రొత్తగా వచ్చు ప్రతి ప్రయాణీకుడును, అచ్చటి సంఘములో స్త్రీల ప్రాముఖ్యతను గమనించక మానడు. అమెరికన్ స్త్రీలు యీ ప్రాముఖ్యతను సంపాదించిన తీరు మహిళా చరిత్రలో ముఖ్యమైన అంకం.

యాత్రిక పితామహులతో (Pilgrim Fathers) వచ్చిన అబలా రత్నములు వారి బల పరాక్రమములనుజూపి పురుషునికి అన్ని కార్యములలోను తోడ్పడి దేశమును ఆక్రమించిరి. అయితే వింత అయిన విషయమొకటి జరిగింది. వలస రాజ్యములు ఏర్పడ్డ తర్వాత స్త్రీలకు ఎన్నుకొను హక్కు (Franchise) కూడ యివ్వరైరి. వారికేలాటి హక్కులు లేవు. కడకు వారి బిడ్డలపై గూడ చట్టప్రకారం వారి కధికారంలేదు. ఉద్యోగములకు అనర్హులని నిషేధింపబడిరి. మిస్. మార్టినో వ్రాసిన అమెరికన్ సాంఘిక చరిత్రలో 1836 లో స్త్రీలకు ప్రత్యేకించిన ఉద్యోగములు 7 మాత్రమే యుండినవని విశదమగు చున్నది!

యంత్రములు జీవితములో ప్రవేశించు తరి కొన్ని విషయములకు స్త్రీల సహాయ మవసరము లేక పోయెను. నూలు వడకుట గుడ్డలు నేయుట యంత్రములే చేయుటచే స్త్రీలకు వ్యవధి యెక్కువయి, సంఘములో చాలా మార్పులేర్పడ్డవి.

1833 లో స్త్రీల సంఘములు, సభలు, ఏర్పడి సంఘసేవ జేయుటకు వ్యాయామ క్రీడలందు పాల్గొనుటకు అవకాశములు కలిగినవి. బానిసత్వమును నిర్మూలించ ప్రత్యేక మహిళాసభ లేర్పడినవి. Female Anti-Slave Society నీగ్రో జాతివారికి సహాయము చేయుటకై పూనుకొన్నది. 1839లో మహాసభ ఏర్పరిచిరి. పురుషులు దీని నెదుర్కొనిరి. సభగూడ పోలీసు సహాయములో జరిగింది. బానిసల సహాయార్థమై 1840లో లండన్ మహాపట్టణములో జరిగిన మహాసభకు అమెరికన్ అభ్యర్థులలో ముగ్గురు స్త్రీలు. వీరికి సభలో వోటింగు హక్కు నివ్వక సభాకార్యక్రమమును గమనించు వసతులు మాత్ర మిచ్చిరి. పరదా వెనుక కూర్చుండ బెట్టిరి. పరదా పద్ధతి 1840లో కూడ పాశ్చాత్యులలో ఆచరణలోయుండినదన్న మాట! బానిసల స్వాతంత్ర్యమునకై ఏర్పాటు చేసిన సభలో స్త్రీలకు మాట్లాడుటకు ఓట్లనిచ్చుటకు స్వాతంత్ర్యములేక యుండుట ఆశ్చర్యముగదా! ఈ సభకు వచ్చిన అమెరికన్ స్త్రీల పట్టుదల ప్రశంసనీయం. 1848 లోనే స్త్రీల హక్కుల నిర్ణయించు మహాసభను (Women's Rights Convention) ఏర్పాటుచేసిరి. ఆందోళన హెచ్చింది. ప్రతికూలుర ప్రబలిరి.

శ్రీమతి యమ్. యస్. పద్మావతమ్మగారు

## దూరసీమల నారీప్రపంచం

స్త్రీలకు వాక్స్వేచ్ఛ (Freedom of speech) యివ్వ గూడదని మత గురువులు తీవ్రముగా వాదించిరి. ప్రబోధము గావించిరి. విద్యాలయములో స్త్రీలకు ప్రవేశము లేదు. Quakers అను క్రైస్తవ మతస్థులు తప్ప మరెవ్వరును స్త్రీలకు వాక్స్వాతంత్ర్యమున్నదని గమనింపరైరి. వేదికలపై నెక్కి స్వేచ్ఛతో వారి అభిప్రాయముల వెలిబుచ్చు స్త్రీలకు శీలము లేదని సంఘము తలంప మొదలిడెను. ప్రజా యుద్ధ సమయములో (Civil war) మొగ, ఆడ భేదము లేక వైద్యులు సేవజేసినను, యుద్ధానంతరము స్త్రీలను వైద్య కళాశాలలోనికి ప్రవేశము లేకుండ జేసిరి. స్త్రీలకు చదువు వసతులు కలుగజేసిన కళాశాలలోని యువకులు వారి సోదరీ మణుల యెడ కడునీచముగా ,అమానుషముగ నడచుకొనిరి ఈ అమానుష్యమును ఓర్పుతో సహించిన వనితామణులు వీరవనితలనే భావింపనగు. పురుషులు వారి చేతనైన యిబ్బందులను కలుగజేసిరి, దూషించిరి, దుమ్మెపోసిరి. స్త్రీ వైద్యులకు మందులు దొఱకకుండునట్లు జేసిరి. ఆనాటి స్త్రీవైద్యులలో ధైర్యవంతురాలు హారియట్ హంటు హార్వార్డు కళాశాలలో ప్రవేశపత్రము నిచ్చినపుడు జరిగిన ఆందోళనము యింతింత కాదు. ఆమెకు ప్రవేశము నిరాకరించిరి. స్త్రీలకై ప్రత్యేకించి వైద్య కళాశాల తెరువగా అచ్చట జేరి వైద్యురాలుగా ఆమె సంఘసేవ చేయబూనినది.

న్యాయవాది వృత్తి నవలంబించుటకుగూడ స్త్రీ లనర్హులని అమెరికాలోని స్టేట్సు అన్నియు చట్టములు చేయించినవి. మతబోధకులుగా స్త్రీలు తగరని మతాధిపతులు శ్రీముఖములబంపిరి. స్త్రీల సంఘములు వీటికి వెఱువక మత బోధకురాండ్రుగా నుండుటకు తమ యర్హతను నిరూపించిరి. స్త్రీలు చేయలేని పని లేదని నిదర్శనములు జూపిరి. అప్పటి రోజులలో మన అమెరికన్ సోదరీమణుల దమనము, శమనము, సహనము గర్వింప తగిన విషయములు.

19 వ శతాబ్దాంత్యములోగా 50 లక్షల స్త్రీలు కర్మాగారములలో, ఆఫీసులలో ఉద్యోగములో జేరిరి. పురవాసినులగు స్త్రీలు సంఘములుగా జేరి, వైజ్ఞానిక విషయములను, సాంఘికసమస్యలను ఎదుర్కొనజొచ్చిరి. ఓట్లహక్కు ఆస్థిపై హక్కులకు పోరాటము మొదలు పెట్ట బడెను.

సమానహక్కుల సంఘము Equal Rights Association బానిసత్వ నిర్మూల సభతో చేరి సూసన్ బి ఆంథోనీ అను ధైర్యశాలి నాయకత్వములో కృషిచేయ మొదలిడినది. బానిసల హక్కుల గౌరవించిరిగాని మహిళా సంఘపు కోర్కెలను గమనించరైరి. హక్కులకై కృషిసల్పు స్త్రీలను అవమానింప మొదలిడిరి. ప్రెసిడెంటు విల్సన్ అంతటివాడు తన దేశములోని స్త్రీలకు సర్వ హక్కులను ప్రసాదింప లేక పోయెను. వారి మానముల కాపాడుటకు పోలీసులుగూడ తోడ్పడలేదు. వీరమాతలు వెఱగందక, వెనుదీయక స్త్రీల వోటింగు హక్కులకై యుద్ధమును సాగించినారు. ఆ వీర వనితలను హింసించిన విధములను కొన్నింటిని తలచుకొన్న మాత్రమున ఒడలు జలదరించును. వారిపై ఉమ్మిరి. మూతిపై ఎగసితన్నిరి. కాలుచున్న చుట్టముక్కలతో ఒడలంత కాల్చిరి. ఆడరాని బూతులాడిరి. అన్నిటికిని ఓర్చుకొని వనితా లోకపు హక్కులకై పోరిన ఆ వీరవనితలకుజోహారు. విల్సన్ గారి వైట్ హౌస్ ఎదుట గొప్ప మంటలో ఆయన స్వాతంత్ర్యమును గూర్చి యొనర్చిన ఉపన్యాసములను కాల్చిరి. రక్షకభటులు స్త్రీలను చెఱబెట్టిరి. స్త్రీలు నిరసన దీక్షపూనిరి. అమెరికన్ కాంగ్రెసులోని పరతులను మార్పించి స్త్రీలకు సంపూర్ణ వోటింగు హక్కులను సంపాదించిరి.

అంతటితో స్త్రీలు సాగించు శాంతి సమరం అంతమొందలేదు. చర, స్థిర ఆస్తిపై హక్కులు వివాహమును రద్దుపఱచు హక్కులు, వారి బిడ్డలను పోషించు హక్కులు వీటికన్నిటికై యెడతెగని కృషిసల్పిరి.

అన్ని వృత్తులలోను స్త్రీలు ప్రవేశించి వారి సామర్థ్యములను వెల్లడించిరి. 110 లక్షల స్త్రీలు వివిధ వృత్తులలో పని చేయుచుండిరి అమెరికన్ స్త్రీలు కేవలం స్వాతంత్ర్య సంపాదనకై గాక సంసారపోషణార్థము ఉద్యోగములను స్వీకరించుచున్నారు. స్త్రీలకు వేతనములు పురుషులతో సమానముగ లేక, వ్యత్యాసము జూపుట అన్యాయము. పనిని గమనించి వేతనముల నివ్వవలయుగాని, స్త్రీ పురుష భేదముల పాటించరాదు.

# దూరసీమల నారీప్రపంచం

ఇంటిపనులను నిర్వర్తించుటలో స్త్రీలు తమ శక్తి సామర్థ్యములను జూపవలసియున్నది. వారి చాకిరి, తగ్గించుటకై నవీన పద్ధతులను గృహములలో ప్రవేశ పెట్టినారు.

స్త్రీలకు సమాన హక్కులను, సంపాదించుటకై Women's Bureau, Women's Party, మొన్నగు సంస్థలేర్పడి Freeman గారి సహాయ్యముతో ఒక చట్టమును ప్రవేశపెట్టి ఆమోదింపజేసినారంటే స్త్రీ సంఘము యొక్క ప్రస్తుత బలము, రాజకీయములలో ప్రాముఖ్యత విశదమగుతుంది. ఆ చట్ట ప్రకారం అమెరికాలో పెక్కు మహిళా సంస్థలు పెరిగిపోయినవి. నేషనల్ కౌంసిల్ ఆఫ్ విమెన్ League of Women Voters, General Federation of Women's Clubs, వీటిలో సభ్యురాండ్రు వేనకువేలు. వాటి ఆదేశములుగూడ అన్ని విషయములను గూర్చి ఆలోచించుటయే. Plant, Flower Guilds అని కొన్ని Daughter's, Adams వంటివి కొన్ని అంతర్జాతీయశాంతి సమావేశములలో పాల్గొని స్త్రీల హక్కులను కాపాడినవి.

సంతాన నిరోధన పద్ధతులలో ప్రభుత్వపు వారికిని స్త్రీ సంఘములకును హోరాహోరిగ పోరాటము జరిగి స్త్రీ సంఘములే జయము నొందినవి.

అమెరికాలోని మన సోదరీమణులు పూర్వపురోజులలోనే గాక ప్రస్తుత కాలములోను స్త్రీ స్వాతంత్ర్యమునకై దీక్ష పూని స్త్రీ సంఘశ్రేయమునకై పాటుబడుచున్నారు. ప్రతి బాలుడు బాలిక యింటి పనులను చక్కపెట్టుటకు తయారు చేయబడుదురు. వంట, కుట్టుపని, గుడ్డలను యుతికి యిస్త్రీబట్టుట, అన్నింటిని ప్రతిబాలుడు బాలిక నేర్చుచున్నది. అమెరికన్ స్త్రీలు వారి వంటింటిని చాలయింద ముగనుంతురు. ప్రస్తుతపు నవీన పద్ధతులతో వంటింటిని యిముద్దురు. స్త్రీలు చదువుకొన్నంత మాత్రమున గృహకృత్యముల కనర్హులను వెఱ్ఱినమ్మకమును పారతోలుదురు. గృహనిర్వహణమను విషయము వారి పాఠ్య విషయములలో యొకటి. చెడిపోయిన Radioను ఎంత నేర్పుతో బాగుచేయకలరో, అంత నేర్పుతో వంటకములను తయారుచేయగల శక్తి ప్రస్తుత విద్యావతియైన అమెరికన్ వనితకు గలదు. మోటారు బండ్లను నడపగల సామర్థ్యముతోనే పాలు పితికి చేమిరి వేసి, మీగడ, వెన్న తీయగల శక్తి, ఓర్పు గలదు.

దంపతులు శిశుసంబంధమైన విషయములన్నింటిలోను ప్రవేశముకలిగి యుందురు. గర్భిణీ స్త్రీలకు వారి భర్తకు క్రమ శిక్షణ గరపబడును. తల్లులు దాసీజనములపై నాధారపడక తమ శిశువులకు తామే పాలిచ్చి పెంచుదురు. శిశుపోషణ పద్ధతులన్నియు పూర్వముగనే గ్రహించి, దానిలో క్రమ శిక్షణపొంది శిశువుల కన్నివసతుల నేర్పరుతురు.

తల్లియే గాక తండ్రియును గూడ శిశువును చూచుకొను పద్ధతులు నేర్చుకొని తన భార్యకు సహాయపడును. ఇంటి చాకిరి శిశు పోషణ భారము తల్లులపైననే వదలక తండ్రులు వారి భాగమును వహింతురు. Manhattan's Maternity Centre Associationలో తర్ఫీదు అయిన తండ్రికి Prepared Parent అనే పట్టభద్రుని బిరుదు యిత్తురు!

స్త్రీలకు సమాన హక్కులను సంపాదించి ద్వంద్వ నీతిని రద్దుగావించి, అన్ని వృత్తులలోను ప్రవేశ మేర్పరచి వారసత్వపు, వైవాహిక హక్కులను సరిదిద్ద కలిగిన అమెరికన్ సోదరీమణుల కెంతయు మహిళా మండలి కృతజ్ఞత జూపవలయును. స్త్రీ, కేవలము అలంకార ప్రియ కాదు. సంఘమునకే అలంకారమని నిరూపించిన అమెరికన్ స్త్రీలు ప్రపంచములోని మన కందఱకు ఆదర్శ జీవులు. స్త్రీల ఆర్థిక, సాంఘిక, రాజకీయ స్వాతంత్ర్యమును సంపాదించ కల్గిన సాధ్వీమ తల్లులకిదే పుష్పాంజలి.



# శకుంతల

## [ఏకాంకిక]

శ్రీ కవికొండల వేంకటరావుగారు

[కణ్వాశ్రమము. ఒక చోట భరతుడు బాలుడు అయిదేండ్లవాడు ఆడుకుంటూ వుంటాడు. దుష్యంతుడు బాలుణ్ణి చూడకుండానే ఆశ్రమం ప్రవేశిస్తూ]

దుష్యంతుడు: [స్వగతము] ఆ నాడు కణ్వాశ్రమం ప్రవేశించినప్పుడు నా కుడిభుజమెలా అదిరిందో ఈ నాడు కశ్యపాశ్రమము ప్రవేశించునప్పుడునూ అదురుతోంది! ఏమి విశేష మిందు కనుగోగల వాడనో? నాడు గన్న శకుంతలలాంటి ఎలనాగ మఱి ఏనాడును, ఏలోకంబునను గాంచుటకల్ల—అయిన నేబది యేండ్లు దాటిన నా యూహాలింకను ఎలనాగల మీదకాపోవుట? ఇది నా లోలో అనుకోవడంగావున సరిపోయినది. ప్రియవయస్యుడే యున్న, విన్న, కన్న నవ్వివోడూ? అదె! అనతి దూరమున బాలుని రూపము. ఇతని చూచు సదృష్టము నాకులభింపనున్నదనియే కావచ్చునా కుడిభుజమట్లదరినది!— బాలుడు! మగబిడ్డ! ఈ హృదయమెంతగ నువ్విళ్లూరుచున్నది వాడే నా సుతుడై యుండవలెనని! కాని చో నితర పుత్రులను తన పుత్రునిగా భావించుకొను వెంగలినే నేను?—[బిగ్గఱగా] బిడ్డా! బిడ్డా! [అని పిలుచును]

[భరతుడు వెదుదిరిగి చూచును]

భరతుడు. ఆఁ! ఎవరు నువ్వు?

దుష్యంతుడు: నేను! [స్వగతములోపడి] "నీ తండ్రిని" అని అననా? ఎంత వెఱ్ఱివాడను? తలువోసికాకపోయిన ఎంత ఘోరనరకమును భవింపవలెనో కదా నేను పరలోకమున? ఎంతటి అవమానమునకు గుఱికావలెనో కదా, ఈ లోకమున?—[బిగ్గఱగా] నేను!

భరతుడు: [పరుగు పరుగున పాఱిపోవును. పోవుడు వానిని దుష్యంతుడాపును]

దుష్యంతుడు: ఎక్కడికా పరుగు?

భరతుడు: మా అమ్మ వద్దకు.

దుష్యంతుడు: ఎందుకు? నేను చాలనూ? నేను పనికిరానూ? నేను [స్వగతముగా] నీ తండ్రిని.

భరతుడు: మా అమ్మతో "నేను" వచ్చినాడని చెప్పొద్దూ?

దుష్యంతుడు: "నేను" పేరుగాదు బిడ్డా!— పోనీలే ఒకటడుగుతా చెప్పు! మీ అమ్మ ఎవరు?

భరతుడు: అమ్మ అమ్మే! నీకు మల్లే "నేను" కాదు.

దుష్యంతుడు: అదికాదు. ఆమె పేరు?

భరతుడు: ఆమె పేరా అమ్మే! నీ పేరు "నేను" లాగ!

దుష్యంతుడు : బాగుంది పాఠం! నీ పేరు ?

భరతుడు : నా పేరు భరతుడు !

దుష్యంతుడు : నీ దేశము

భరతుడు : భరతఖండము నా పేరింటిదే !

దుష్యంతుడు : ఈ సంగతి ఎవరు చెప్పినారు నీకు ?

భరతుడు : మా అమ్మ చెప్పింది.

దుష్యంతుడు : మీ అమ్మదేదేశం ?

భరతుడు : మా అమ్మదీ నాదేశమే! నేనెక్కడుంటే అక్కడే వుంటుంది మా అమ్మ.

దుష్యంతుడు : మీ నాన్నది ?

భరతుడు : నాన్న ? నాన్నెవరు ?

దుష్యంతుడు : [విన్నబోవుచు స్వగతముగ] ఎందుకడిగితిని ఆ ప్రశ్న ? [అని ఉంగరమున్న వేలిని కొఱికికొనును].

భరతుడు : [ఉంగరముచూస్తూ] ఏమిటది? ఆమెఱిసేది ? నాకివ్వవు ?

దుష్యంతుడు : బిడ్డా! ఇది ఇచ్చేదికాదు. పొరబాటులను సవరించేది. [అని గారడీగా ఆ యుంగరమును మాయముచేసి] ఏదీ? ఇప్పుడు ? ఉంగరము ?

భరతుడు : [భ్రాంతిగా] అదిగో ఆచేతినుంది ?

దుష్యంతుడు : ఏదీ ? [అని ఆ చేయిచూపి] లేదు పోయింది !

భరతుడు : మా అమ్మ అన్నట్లే అంటున్నావు !

దుష్యంతుడు : మీ అమ్మ అనేది ఏమిటి ?

భరతుడు : "ఉంగరము పోయింది" అని

దుష్యంతుడు : 'పోలేదు ఉం'దని మీ అమ్మ చెప్పి ఈలా ఆమెను తీసికురాగలవా

భరతుడు : మఱి పోయిందన్నావు ?

దుష్యంతుడు : పోలేదు. ఇదిగో! [అని ఉంగరము తిరిగిచూపు]

భరతుడు : ఉందే! పోయిందన్నావె! దొంగా!

దుష్యంతుడు : మాట పొరబాటు ; పోలేదు ; మాయమైంది.

భరతుడు : ఆలాగ్గానే మా అమ్మ వుంగరం కూడా మాయమైవుండకూడదూ ?

దుష్యంతుడు : అదేనేననీమాటా నున్న !

భరతుడు : మఱి ఈ వుంగరాన్ని రప్పించినట్టే దాన్నికూడా రప్పిస్తావు ? మా అమ్మతో చెప్పి మా అమ్మను ఈలా తీసికొనివస్తాను,

దుష్యంతుడు : ఏమనిచెప్పి తీసికొనివస్తావు ?

భరతుడు : ఏమని ఏమిటి ? ఉంగరాల మాయాల మారివచ్చాడు ! పోయిన వుంగరాల్ని తిరిగి రప్పిస్తాడు ! అనిచెప్పి తీసికొనివస్తాను, [అటు చూసి] నేను పిలవకుండానే వస్తూవుంది అమ్మ !

దుష్యంతుడు : నా దగ్గఱనున్న ఉంగరం మాట మీ అమ్మతో చెప్పకు.

భరతుడు : అబ్బా ! ఎందుకుచెప్పను ?—[ఎలుగెత్తి] అమ్మా ! నీ యుంగరం ఈ అబ్బి దగ్గఱుందే ?

[శకుంతల ప్రవేశిస్తూ]

శకుంతల : [ఎఱుగనట్టు] ఎవరా అబ్బి ?

భరతుడు : అదుగో ! [అని దుష్యంతుని చూచి]

శకుంతల: [తలవంచుకుని] అబ్బి కాదు! ఆర్య పుత్రులు!

దుష్యంతుడు: [తలవంచుకుని] ఉంగరం దొరి కింది! [అని ఉంగరం అందిచ్చును]

శకుంతల: ఉంగరంతో? [అని ఉంగరము అందు కొనును].

దుష్యంతుడు: అభిజ్ఞానమని నీ అభిప్రాయం కాబోలు! కాదు! వీడు! [అని భరతు నెత్తుకొనును]

శకుంతల: ఈ యుంగరమే నా పోయిన యుంగ రము. ఎలా పోల్చావురా? బిడ్డా! [అని అందుకొనును].

దుష్యంతుడు: ఎలాగేమిటి? ఈ అబ్బిదగ్గఱ ఒక్కటే యుంగరముంది కనుక!

భరతుడు: అబ్బివి కావు. ఆర్యపుత్రుడివి!

శకుంతల: నాకు ఆర్యపుత్రులు ఈయన. నీకు నాన్నగారు!

భరతుడు: నాన్నగారు! [అని తల్లి చంకనుండే తండ్రి మీసముపట్టుకుని లాగును].

[తెరపడును]



# అభాగిని లేఖలు

అమ్మాయి,

గబగబా నాలుగుముక్కలు వ్రాయడానికి తగిన ఓపికలేదు. మునుపటిరోజులాయివి! ముసలిదాన్నయిపోయాను. చేతులు పట్లు తప్పిపోతున్నాయి. కళ్లకి ఛత్వారం. అందుకనే జాబు వ్రాయడానికి ఆలస్యం అయింది. అదీగాక తీరుబడి ఎల్లా వుంటుంది చెప్పు, ఒకరింట్లో చాకిరీచేసేదానికి. ఇంటివాళ్లు మంచి వాళ్లు కాబట్టే ఏంచేసినా, ఎల్లాచేసినా సర్దుకుని పోతున్నారు. ఓపికలేనిది, దిక్కులేనిది, ముసలిది అని దయతలచి నేనేం లోటుచేసినా వూరుకుంటున్నారు. కాని ఎన్ని చెప్పు, తప్పుచేసి నప్పుడల్లా నేను యిదవకుండా వుండలేను. అప్పుడప్పుడు వాళ్లు విసుక్కుని మాటలనకుండా వుండలేరు. ఆఖరిరోజుల్లో యిటు వంటి అవస్థపడవలసివచ్చింది కదాయని కర్మని నిందించు కుంటూ దేవుళ్లాడుతున్నాను. వంటలక్కపని చేస్తేనేగాని పూట గడవని పరిస్థితివచ్చింది నాకు. ఓపికలేని యీ వార్ధక్యదశలో ఒకరికి చాకిరిచేస్తూ బ్రతికేదానికన్న చస్తేమేలనుకుంటే యింకా దేవుడికి నామీద దయరాలేదు. యీ గుక్కెడుప్రాణం ఎప్పుడు పోతుందాయని ఎదురుచూస్తున్నాను. బ్రతికినన్నాళ్లు బాధలు తప్పవుగా నాలాంటిదానికి.

అమ్మాయి, "కొండంత కొడుకువుండగా నువ్వు వంట లక్కగా వుండవలసిన ఖర్మం ఏం వచ్చింది?" అనివ్రాసావు. బాగానేవుంది. కొండంత కొడుకువున్నాడు. నామొగుడు సంపా దించిన ఆస్థివుంది. ఏం లాభం! అనుభవించేయోగం లేనప్పుడు జరిగినదంతా తెలిస్తే నన్నాప్రశ్న అడిగివుండేదానవు గావు. "మామ్మా, మామ్మా కథలు చెప్పవూ" అంటూ నాచుట్టు తిరిగేదానవు. ఇరుగుపొరుగు భేదంలేకుండా. చుట్టాలు పక్కాలు అనే విచక్షనలేకుండా మా యింట్లో పుట్టిపెరిగినదానిలా వుండే దానవు. ఇంకా నాకళ్లకు కట్టినట్టు కనిపిస్తోంది. నువ్వు మా యింట్లో ఆడుకుంటూంటే నాకు ఆడపిల్లలులేరన్న చింత వుండేది కాదు. ఆరోజులు వెళ్లిపోయాయి. మా అబ్బాయి పెళ్లి నీకు జ్ఞాపకం వుండేవుంటుంది. మొగపెళ్లివారి తరపున పెద్ద ముత్తయి దువ నువ్వేగా అప్పుడు! నువ్వు జ్ఞాపకంవచ్చినప్పుడల్లా యివన్నీ తలంపుకు వస్తూవుంటాయి. చిన్నప్పటినుంచి నీకు మామ్మమీదుండే అభిమానమే మామ్మ క్షేమసమాచారములను తెలుసుకోవాలనిపించిందికామా? నీకు కాకపోతే యింకెవరికి చెప్తానునాగోడు. కాకపోయెనా యింకెవ్వరువింటారు నాదీన చరిత్ర. నీకు పెళ్లయి అత్తవారింటికి వెళ్లిపోయావు. తర్వాత ఏమేమిజరిగామో నీకు తెలియడానికి నువ్వు అత్తవారింట్లో వుండిపోయావు!

ఆయన పోయినప్పటినుంచి అబ్బాయిని అల్లారుముద్దుగా పెంచాను. ఆస్థిని కాపాడుతూ అబ్బాయికి చదువు సంధ్యలు చెప్పించి పెద్దవాణ్ణి చేసాను. పెళ్లిచేసాను. వాడి అదృష్టమా అంటూ వున్నవూళ్లోనే మంచి వుద్యోగం దొరికింది. ఇంకేం కావాలి! కొడుకుకోడలు కులాసాగా వుంటుంటే "కృష్ణా, రామా" అనుకుంటూ హాయిగా రోజులు గడపగలననే నిశ్చింతతో వున్నాను. కాని, రోజులు యిలా పరిణమిస్తాయని ఎప్పుడు అనుకోలేదు. నా ఆశలన్నీ నిరాశలయిపోయాయి. ఆఖరికి నాకీ గతి పట్టింది. అవన్నీ తలుచుకుంటుంటే నా కడుపు తరుక్కు పోతూందంటేనమ్మా. కోడలు కాపరానికి వచ్చింది. పూచికపుల్ల ముట్టుకుంటే ఎక్కడ కందిపోతుందో అని ఎంతోయిదిగా యింటి చాకిరీ అంత నేనే చేసేదాన్ని. తన పెళ్లాంచేత పనిచేయిస్తోంది అని కొడుకు అనుకుంటూడేమోనని అన్నీ నేనే అమర్చేదాన్ని కాని మంచికిరోజులు అయితేగాయివి. అదేమిటోగాని కోడలికి నా పొడ అంటేనే గిట్టేదికాదు. చీటికిమాటికి పుల్లవిరుపు మాటలు అంటూ వుండేది. శుభ్రం, శుచిగాని మంచి మర్యాద గాని తెలియని పిల్ల అది. యిల్లు వళ్లు అంతా ఎంగిలిమయం చేసేది రోజూను, సరిగా పోపువేయించడంకూడా తెలియదు, ఒక్కపని తీరుగా చేయడం రాదు. నేను ఎంతో యిదిగా, నెమ్మదిగా "అల్లా చెయ్యాలి, ఇల్లా చెయ్యాలి" అని చెప్పే దాన్ని. అయినదానికి, కానిదానికి దూబరా ఖర్చులు చేస్తూ వుండేది. చూస్తూ వూరుకోలేక అప్పటికి తోచినట్టు నెమ్మదిగా చెప్తూవుండేదాన్ని. తప్పు చూపెట్టడమే తడటాగాఎంచి నామీద రంయ్‌మంటూ లేచేది. నానా హంగామాచేసేది. ఒక్కొక్క

ప్పుడు నన్ను నానామాటలు అని ఏడుస్తూ కూర్చునేది. నేను కోడంటికం పెడ్తున్నానని అందరికి తెలియాలని నటించేది. వూరందరికీయాగీ చేసేది. కొడుకు యింటికి రాగానే నామీద నేరాలు చెప్పడం మొదలెట్టేది. రోజులు గడిచిన కొద్దీ నా కొడుకు తత్వంలో మార్పులు రావడం మొదలెట్టాయి. మా యిద్దరి మధ్య అఘాతం ఏర్పడింది. పెళ్లాం మాటలు నమ్మి నామీద మండిపడేవాడు మావాడు. మా కోడలు తాలూకు చుట్టాలు ఎవరెవరో అస్తమానం వస్తూ పోతూవుండేవారు. వాళ్లందరికీ నేనే విరోధినయ్యాను. అందరిమాటలు పట్టుకొని మావాడు నామీద ఎగిరిపడేవాడు. ఒకసారి నామీద చెయ్యి చేసుకున్నాడు కూడాను. కన్నకొడుకు అంతపని చేస్తాడని ఎప్పుడూ అనుకోలేదు. చిన్నప్పుడు ఎంత అల్లరిచేసినా గట్టిగా కేకలు వేసిన పాపాన్నికూడా పోలేదు నేను. కన్న కొడుకు కొట్టాడనే బాధ ముందు దెబ్బలుతిన్న శరీరం బాధ నాకేం కనిపించలేదు. కన్నతల్లిని పట్టుకొని కొడ్తుంటే యింట్లో వాళ్లంతా చూస్తూ వూరుకున్నారు. కన్నకొడుకే కఠిన హృదయుడైతే యింక యింట్లోవాళ్ల మాటవేరే చెప్పాలా?

"ఏరానాయనా ఒకళ్లజోలి, శాంతిలేకుండా నామానాన్న నేను వండుకొని తింటాను. ఖర్చులికి సరిపడ డబ్బుయిస్తూ వుండు" అన్నాను ఒకరోజున. "వేరేవంట! యీవేషాలేం నా దగ్గఱ పనికిరావు చెప్పినట్లు పడివుండు. లేకపోతే, పో!" అని నా మీద కస్సుమని లేచాడు. ఆ మాటలు వినగానే విలువునా నీరయిపోయాను. ఏం చెయ్యమ చెప్పు. ఏ నుయ్యో. గొయ్యో చూసుకుందామంటే మనస్సు యిష్టపడలేదు. ఏమన్నా వాడు సంపాదించినది యిమ్మన్నానా? నా మొగుడు సంపాదించిన డబ్బులోది కొంత యిమ్మన్నాను. నా మొగుడు సంపాదించిన ఆస్థిని నేను అనుభవించడానికి నోచుకోలేదు ఇంట్లో ఒక్క నిమిషంకూడా వుండడానికి యిష్టపడలేదు నా మనస్సు. అంతే యీ వూరు వచ్చేసాను. యిల్లా వంటలక్కగా చేరాను. కొండంత కొడుకువున్నాడు. ప్రయోజనం శూన్యం. నా మొగుడు సంపాదించిన ఆస్థి నాకు అనుభవించే యోగంలేదు. అప్పుడప్పుడు ఉత్తరాలు వ్రాస్తూవుండు అమ్మాయి. నాకు వీలయినప్పుడు నేను వ్రాస్తూవుంటాను.

..........................



# యుగపురుషుని అస్తమయం

❋ శ్రీమతి గొల్లమూడి రాజ్యలక్ష్మమ్మగారు ❋

గాంధీ మహాత్ముడు అమరుడైనాడు. భారతదేశాన్ని ఆవహించిన పారతంత్ర్యాంధ కార్యాన్ని పటాపంచలు చేసిన దివ్యజ్యోతి అస్తమించినది. అంపశయ్యపైన భీష్ముడు అస్త్రసన్యాసం చేసి రథముమీద ద్రోణుడు అసువులు బాసిన కురుక్షేత్ర సమీపంలో బిర్లామందిర ప్రాంగణాన ఒక మతోన్మాదుని దురాగతమునకు గురియై ఈ యుగ పురుషుడు అవని కొరిగినాడు. జీవితమంతా దయా సత్య శౌచములకొరకు కృషిచేసిన దయామయునికి ఇరువది శతాబ్దముల పూర్వం ఏసుక్రీస్తువలె బలవన్మరణం ప్రాప్తించినది. ఏమైతేనేమి తన జీవిత సర్వస్వాన్ని లోకానికి అర్పించి భారత దేశానికి స్వాతంత్ర్యము సమకూర్చిన మానవోద్ధారకుడు, ప్రేమ స్వరూపుడు, గాంధీమహాత్ముడు ఇక లేడు.

ఆయన తన దేశమునందే గాక ఖండఖండాంతరముల యందుగూడ మహాపురుషుడనీ, అహింసా మూర్తియనీ పేరెన్నిక గన్నవాడు. అట్టి మహర్షిని సాటి హిందువుడు ఘోరహత్య చేసినందుకు హిందూజాతి ఎంతైనా సిగ్గుపడ వలసిందే. ప్రజల కష్టం తన కష్టంగా ప్రజల దుస్థితి తన దుస్థితిగా ప్రజల దుఃఖం తన దుఃఖంగా ప్రజలే తనుగా తానే ప్రజలుగా భావించి దేశ కళ్యాణం కోసం ఆజన్మాంతం పాటుపడ్డ లోకారాధ్యుడు. తాను చెప్పినదంతా చేసి చూపిన మహాత్యాగి గనుక అసహాయోద్యమంలో దేశమంతా ఆయన అడుగు జాడలలో నడిచి చెప్పినట్లు చేసి నానా కష్టాలను ఎదుర్కొన్నది. పరదాచాటునయుండే అసూర్యం పశ్యలైన మహిళామణులంతాకూడా ఆయన పిలుపు వినిపించే సరికల్లా బయటపడి లాటీదెబ్బలు తిని జయిళ్లు నింపేశారు. అది ఎంత గొప్ప ఆకర్షణ శక్తియో చూడండి.

దేశసేవకోసం దేశంలో వైషమ్యాలు లేకుండా సామరస్యమును నెలకొల్పే నిమిత్తం తాను 125 సంవత్సరాలు జీవించాలని కోరుకునేవాడు. ఈ ప్రళయం సంభవించక పోయినట్లయితే సవ్యంగా 125 ఏండ్లు బ్రతికి యుండెడి వాడే. 'జాతస్యమరణం ధృవం' అను సూక్తి ననుసరించి ఎప్పటికైనా యిది తప్పదు కాని, ఇందువల్ల మహాత్ముని జీవితానికి విలువ హెచ్చినది. ఆ చంద్రతారార్కం ఆయన ఖ్యాతి శాశ్వతంగావుంటుంది. భావి హిందూదేశ చరిత్రలో ఆయన గాథ సువర్ణాక్షరాలతో ప్రకాశిస్తూ వుంటుంది.

ఆయన అమరుడైనాడు. దేశమంతా ఆయన కోసం విలపిస్తున్నది. ఆయన దేహం నశించిందే కాని ఆయన కీర్తి నశించేదికాదు. శ్రీకృష్ణపరమాత్మునివంటి రాజకీయ వేత్త. కృష్ణపరమాత్మునివలెనే గీతా బోధకుడు. కృష్ణావతారము నిష్క్రమించుటకు ఒక బోయవాడి బాణము కారణమైనది.

మహాత్ముని అవతార పరిసమాప్తికి ఒక క్రూరకర్ముడి మారణ సాధనము కారణమైనది.

గడచిన దానికి వగచిన లాభములేదు. భారతీయులందరూ సోదరన్యాయముతో మహాత్ముని ధర్మ సూత్రాల ననుసరించి నడుచుకుంటే ఆయన సంస్థాపించిన స్వతంత్ర భారత దేశం చిరస్థాయిగా వర్ధిల్లగలదు. అనేక కోట్ల జనం తిన తిండిలేక కట్ట గుడ్డలేక అల్లాడుతున్న దృశ్యంచూచి కరుణాసాగరుడైన గాంధీజీ మేకపాలు వేరుశనగ పప్పులతో ఆ చిరుబొజ్జ నింపుకుంటూ మోకాటివరకు మాత్రమొక పంచ కట్టి పైనొక తుండుగుడ్డతో కాలంగడిపిన ఆదర్శమూర్తి. ప్రజలు తమ పని తామేది చేసుకున్నా గౌరవభంగమని భావించేరోజులలో తన సకలమైన పనులు తానే నిర్వర్తించుకుని ప్రజల దురభిమానమును సోమరితనమును కొంతవరకు తగ్గించగలిగినాడు. త్రాగుడును అస్పృశ్యతను పూర్తిగా నిర్మూలించగలిగిన సంస్కర్త. దేశాభిమానమును ఆత్మగౌరవమును ప్రజలలో ప్రజ్వలింప జేసిన ప్రతిభాశాలి.

# యుగపురుషుని అస్తమయం

ప్రపంచంలో ప్రతి యుద్ధము జన నాశనముతోను విధ్వంసముతోను ముగిసినది కాని బ్రిటిష్ ప్రభుత్వముతో మహాత్ముని నాయకత్వమున జరిగిన స్వాతంత్ర్య సమరంలో ఒక్క రక్తపు బొట్టయినను చిందలేదు. సత్యాగ్రహ సాధనముతోనే ప్రజాప్రభుత్వము సిద్ధించింది. శ్రీకృష్ణుడు యశోదానందులకు కూరిమినందనుడై గోపగోపికలకు వేడుక చెలికాడై గోగోపకులకు సంభవించిన భయోత్పాతములను తొలగించుటకు అసహాయ శూరుడై బలవంతులైన రాజులకు భయంకరుడై తన్ను నమ్మిన వారికిదాసుడై పాండవులకు ఆపద్బాంధవుడై సమయానుకూలముగ జీవితమును గడిపినట్లే మహాత్ముడుకూడ దరిద్రులలో దరిద్రుడై అస్పృశ్యులలో అస్పృశ్యుడై దుఃఖితులలో దుఃఖితుడై నాయకులలో మహానాయకుడై జీవితమును గడినాడు. తన ప్రాణములు తీయుటకు దుష్టులు వేచియున్నారని ప్రత్యక్షముగ చూచియుండియు ప్రాణరక్షణకు ఒప్పుకొనని ధీరుడు. హింసను ఎదుర్కొనుటకు అహింసయె ఏకైకమార్గమను అకుంఠిత ఆత్మవిశ్వాసముతో వివిధ మత సామరస్యానికి ప్రాణముల నాహుతి చేసిన యుగపురుషుడు గాంధిమహాత్ముడు.

మహాత్ముడు ప్రసాదించిన దివ్యజ్యోతిని అమరజ్యోతిగా నిర్వహించుట భారతీయుల విధ్యుక్త ధర్మం. అట్లు చేయుటవల్లనే మహాత్ముని ఆత్మకు సంపూర్ణమైన తృప్తి.



# మా హాస్టలు వార్షికోత్సవము

శ్రీమతి డి. సుందరమ్మగారు

జనవరి 13 వ తారీకున మా హాస్టలు వార్షికోత్సవము జయప్రదంగా జరిగింది. అది మా హాస్టలు జీవితములో ఒక రసవత్తరమైన ఘట్టం. ఆ రోజు ప్రొద్దున 4 గంటలకల్లా మా హాస్టలు పిల్లలందరు అమితోత్సాహంతో లేచి, మా హాస్టలు అలంకరణ చేసి, 6 గంటలనుండి సరస్వతీ పూజ ప్రారంభించారు. ఆ రోజు ప్రతి హాస్టలు విద్యార్థిని ముఖము కలకల లాడుచు స్వతంత్ర భారతదేశంలో ఇదే మొదటి స్వతంత్ర వార్షికోత్సవమని పొంగిపోయింది. తరువాత 8½ గంటలనుండి 12 గంటలవరకు ఆట పాటలు జరిగాయి. హాస్టలులోని పిల్లలందరు బహుమానాలకు ఆశించక ఎంతో ఆనందంగా వాటిలో పాల్గొన్నారు. పెక్కురు బహుమతులంది మాసంతోషానికి పాత్రులయ్యారు. ఆ రోజల్లా శ్రీమతి సత్యవతిగారు, హాస్టలు కార్యక్రమమంతా తమ చేతుల ద్వారా నడిపించి మా జమునక్కయ్యగారికి కొంత విశ్రాంతి నివ్వగలిగారు. ఇక మంగళంగారు ప్రొద్దున 4 గంటలనుంచి రాత్రి 9 గంటలవరకు ఒక చోట రెండు కాళ్లు పెట్టలేదనిన అతిశయోక్తి కాదు. ఇక మా హాస్టలు పిల్లల సమాచారము వేరే చెప్ప నవసరము లేదు. ఆగస్టు పదిహేనవ తారీకు మాకు సంపూర్ణ స్వాతంత్ర్యము రాలేదేమో కాని ఆ రోజుమాత్రము, సంపూర్ణ స్వాతంత్ర్యము పొందామని అందరు ఉప్పొంగిపోయాము. ఆ రోజు మాతోకూడ ఎంతోమంది అతిథులను భోజనముకై ఆహ్వానించారు. తర్వాత మా పారిశ్రామిక శాఖ:విద్యార్థిని రాజ్యలక్ష్మి ఒక డప్పు తయారుచేసి దుర్గాబాయిగారు మొదలుకొని మా బోయివరకు జేజేలు చెప్పడం ప్రారంభించింది. అందరూ ఆమెతో పాల్గొన్నారు. మా జమునక్కయ్యగారు మా అమాయక సంతోషానికి చిరునవ్వు నవ్వుకుంటూ వెళ్లిపోయారు. నాలుగు గంటలకి హాస్టలు పిల్లలందరూ మా జమునక్కయ్యగారితోను శ్రీమతి దుర్గాబాయిగారితోను చింతగుట్ల సీతమ్మగారితోను, చెన్నగంటమ్మ గారితోను ఫోటో తీయించుకొన్నారు. సాయంకాలము 5½ గంటలకి హాస్టలు పిల్లలందరు కొన్ని నాటకాలువేసి సభ సభ్యారాంద్రను ప్రేక్షకులను ఆనందసాగరంలో ముంచారు. మెట్రిక్ సీనియర్ పిల్లలు "బధిర చతుష్టయము" అన్న నాటకము వేశారు. అందు రత్నమ్మ, భార్గవి మున్నగువారు పాల్గొన్నారు. ఫాన్సీడ్రెస్ పోటీలో పెక్కురు పాల్గొన్నారు. అందు శారద బెంగాలు దేశములోని అనాథ యువతిగా వేసి, అచ్చటి స్త్రీల విషాద జీవిత చరిత్రను మా ఎదుట చిత్రించ కలిగింది. పారిశ్రామిక శాఖ పిల్లలు, సబ్ జూనియర్ పిల్లలు కూడ నిత్య జీవితములో జరిగే ఒడుదుడుకులను నాటక రూపంగా ప్రదర్శించారు. మా చిట్టి పిల్లలు చి. రాజ్యలక్ష్మి, చి. రూపకుమారి వారు

## మా హాస్టలు వార్షికోత్సవము

కూడ ఒక చిన్న నాటకము వేసి వారి చేతనైన సహాయము చేయకలిగారు. ఆరోజు కార్యక్రమము " దివ్యజ్యోతి " టేబ్లూతో పరిసమాప్తి నొందింది.

మా హాస్టలులో మేము 60 మంది పిల్లలము వున్నాము. వివిధ జాతులవారు—చదువుకొన్నవారు, చదువు లేనివారు, గొప్పవారు, పేదవారు మా హాస్టలులో అందరము భేదభావములేక ఏకీభావముతో కలసిమెలసి ప్రవర్తించుచున్నాము. ఎందరెందరో దూరదేశాల నుండి వచ్చినను మా జమునక్కయ్యగారిని సుశీలక్కయ్యగారిని చూచుకొనుచు తల్లితండ్రులను వదలి వచ్చిన బాధ పోగొట్టుకొనుచున్నారు. శ్రీమతి దుర్గాబాయిగారిచే నెలకొల్పబడి, పెంపొందింపబడిన ఈ 'ఆంధ్ర మహిళా సభ' అన్న దివ్యజ్యోతి అమర చిరకాలము వెలుగొందు గాక !





మా హాస్టలు విద్యార్థినులు

# అవతారమూర్తి గాంధీజీ

✻ శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారు ✻

మహాత్మునితో సాటియైన మహనీయుడుగాని యవతార పురుషుడుగాని మహర్షి గాని ప్రవక్తగాని రాజనీతివేత్త గాని సంఘ సంస్కారిగాని యెవరైనా ఉన్నారా అని వెతికితే యెవ్వరూ కానరారు. ఆయన కాయనయే సాటి.

భార్యను త్యజింపని శ్రీరాముడు, జారచోరత్వములులేని శ్రీకృష్ణుడు, అహంకార అహంభావములు లేని మహర్షి, అహింసను వీడని బుద్ధుడు, తన మతస్థాపన కొరకు ప్రాణ హింస చేయని మహమ్మదు, భూమిమీద స్వర్గరాజ్యమును నెలకొల్ప ప్రాణములర్పించిన యేసుక్రీస్తు గతించిన మహా పురుషులు. ఒక్కొక్కరిలో ఒక్కొక్క మహాత్మ్యము మాత్రమే కనబడుచున్నది. ఒక్కొక్కరు ఒక్కొక్క విషయములో మహాత్ములు కాగలిగిరి. కాని గాంధీ మహాత్మునిలో అన్ని యుత్కృష్ట ధర్మములు ఇమిడి యున్నవి. ఈయన ఒక హిందూదేశమునకే యననేల ప్రపంచమునకంతకు ఆదర్శనీయమైన, మాలిన్యములేని సత్యాహింసలతో గూడిన మహోత్కృష్ట హిందూమత ప్రచారకుడు. సైన్యము గాని, ఆయుధములుగాని, తుదకు పరుషవాక్యమైనను నుపయోగింప నక్కరలేకుండ కుట్రలు, పన్నాగములు, మాయోపాయము, మిత్రద్రోహములు, చతురోపాయ సాధనములు మొదలగు వక్రమార్గములులేని నిష్కళంకని ష్కపట నిరాడంబరమైన సాత్విక నిరోధమను రాజనీతి నవలంబించి ప్రాణిహింస చేయలేని రాట్న చక్రమును చేబూని బలవద్విరోధియైన సామ్రాజ్య తత్వము నెదుర్కొని స్వారాజ్యమును గొనివచ్చిన గొప్ప రాజనీతి వేత్త. వందలకొలది సంవత్సరములనుండి సంఘములో పాదుకొని పోయియున్న అస్పృశ్యతను, స్త్రీ జాతి యొక్క దుర్బలత్వమును నివారింపజేసి సర్వమానవ సమానత్వమును పునరుద్ధరింపజేసిన గొప్ప సంఘ సంస్కర్త. దరిద్రముతో బాధపడు ప్రజలకు దాని నివారించు విధానమును బోధించి దేశములో దారిద్ర్య దేవత తొలంగు సూత్రములను గనిపెట్టిన అర్థశాస్త్ర వేత్త.

ఒకటననేల భగవంతునిలోనైనా నేమేని లోపము లుండవచ్చును గాని యీ మహనీయునిలో నే లోపమును గానరాదు. పరిపూర్ణుడు, కేవలము భగవంతుడనియే చెప్పవచ్చును. అట్టి మహనీయునికి అట్టి పరిపూర్ణ మానవునకు ఇట్టి ఘోరమరణము సంభవించుట శోచనీయము. కేవలము భగవంతుడే అయిన శ్రీకృష్ణ భగవానుడు ఒక సామాన్యపు యెరుకలవాని బాణఘాతముచే యవతారమును చాలింపవచ్చినది. నేడు మరల కేవలము భగవంతుడే యని చెప్పదగు గాంధీ మహాత్ముడు ఒక సామాన్యపు మతోన్మాదియొక్క తుపాకి గుండుకు దెబ్బకు గురియై యవతారమును ముగింపవలసివచ్చినది. ఈ మహనీయుడు మనలను దుఃఖసాగరములో ముంచి తన యవతారమును చాలించినను ఆయన యాత్మ, దివ్యజ్యోతి ప్రపంచ ప్రజలందరిలోను ప్రవేశించి యతిహేయమైన రాక్షస ప్రవృత్తిని వారి హృదయములనుండి తొలగింపజేసి మానవుల నందరను దేవతలనుగా మార్చి గాంధీ మహాత్ముని మహోన్నతాశయమైన స్వర్గరాజ్యమును, భగవంతుని రాజ్యమును భూమిమీద స్థాపించునట్లు చేయుగాక !

ఇట్టి యుత్తమోత్తముని సమకాలికులమైన మనము చాలా యదృష్టవంతులము. మనము పుణ్యము చేశామో లేదో మనకు తెలియదుగాని ఇట్టి మహోత్కృష్ట పురుషుని కాలములో మనము జన్మించుట, ఆయన సహచరులమగుట, ఆయన పవిత్రోపదేశముల నాలింప నోచుకొనుట ఆయన దివ్యమూర్తిని సందర్శింపగల భాగ్యము కలిగియుండుట ఇవే మనము పుణ్యాత్ముల మనుటకు తార్కాణము. వెనుక మహావిష్ణువు శ్రీ రామవతారమెత్తినపుడు దేవతలందరు ఆయనకు సహచరులై భూమిమీద జన్మించిరట. అట్టి యదృష్టమే మనకు లభించినది.

ఈ లోకోత్తర పురుషుడు, భగవదంశ సంభూతుడు, అవతారమూర్తి యొక పర్యాయము మా గృహములోనున్న

కీర్తిశేషుడైన మా సోదరుడు రామారావుయొక్క చిత్రకళా మందిరమును మా సోదరి శ్రీమతి బుచ్చికృష్ణమ్మ వేసిన చిత్తరువులను చూచుటకు వచ్చెను. తొలిరోజున మా సోదరి వెళ్లి ఆయనను ఆహ్వానింపగా రేపు ఉదయము సరిగా 6 గంటలకు వచ్చెదనని చెప్పిరి. మేమంతా అపరిమితానంద భరితులమయాము. మా గృహము పావనమగు ననుకొన్నాము. ఉదయముననే స్నానములుచేసి పరిశుభ్ర వస్త్రములను ధరించుచున్నాము. మా యూహ-ఆయన కారులో వచ్చుననియు, ఆయన కారుతోబాటు ఇంకా చాలా కార్లు వచ్చుననియు, ఆ చప్పుడు వినగానే క్రిందికి పరుగెత్తవచ్చుననియును. మా సోదరికి ఆయనయొక్క తత్వము కాలనియమ పాలనము (Punctuality) బాగా తెలుసు. ఆమె చడీ చప్పుడూ కాకుండా స్నానముచేసి శుభ్రమైన బట్టలను కట్టుకొని పూలదండ నొకదానిని చేతబట్టుకొని చిన్న కుఱ్ఱవాడు నాలుగేళ్లవాడు మా మరియొక చెల్లెలి కొమారుని తీసికొని చిత్రకళా మందిరములో సిద్ధముగా నున్నది. మా అమ్మమ్మ ఆయనను నిజముగా భగవంతుడేయని భావించు భక్తురాలు. ఒక పళ్లెములో హారతిదీపము, పండ్లు, తాంబూలము పెట్టుకొని నిలువబడియున్నది. మా యింట్లో కాపురమున్న ఒక ఆయన వీధియరుగుమీద ముఖము కడుగుకొంటున్నారు. మోకాటి ధోవతి, పైబట్ట, చేతిలో కఱ్ఱపుచ్చుకొని యెవరి సహాయము లేకుండా ఒంటరిగా గాంధిగారు చిత్రకళామందిరపు గుమ్మము తెలియక రెండవ గుమ్మము వద్దకు వస్తున్నారట. ఆ ముఖము కడుగుకొనే ఆయన ఈయననుచూచి యెవరో బిచ్చగాడని యనుకొన్నారట. ఆయన where is Ramarao's art gallery? అని యింగ్లీషులో అడుగగానే అంతక్రితము మేమనుకొనుచున్న మాటలు వింటూ మేము పడే హడావడి చూస్తూఉన్న ఆయన గాంధిగారేమోనని ఖంగారుపడిలేచి నమస్కరించి చిత్రకళా మందిరమునకు గొనివచ్చిరి. మా చెల్లెలికొడుకు దండవేశాడు. మా చెల్లెలు నమస్కరించింది. అమ్మమ్మ ఆయనకు హారతిచ్చి, పండ్లు తాంబూలము చేతిలోపెట్టి, సాక్షాత్కరించిన భగవానునకు నమస్కరించింది. ఆయన చిత్రములను చూచారు. మా చెల్లెలిని కొన్ని ప్రశ్నలువేసి విషయములు తెలిసికొన్నారు. 5 నిమిషములుండి వెళ్లిపోయారు. అంతా నిశ్శబ్దంగా జరిగిపోయింది. కార్ల చప్పుళ్లులేవు, జయజయ ధ్వానములులేవు. చివరకు మనుజుల అలజడియైనాలేదు. అయ్యో! ఆరుదాటిపోతోంది గాంధిగారు వస్తారని గబగబా మేమంతా బట్టలు కట్టుకొని 6 గంటల 5 నిమిషములకు క్రిందికి దిగాం. మా చెల్లెలు నెమ్మదిగా గాంధీగారువచ్చి బొమ్మలుచూచి వెళ్లిపోయారని చెప్పింది. నిర్ఘాంతపోయాము. ఆయన సమయపాలనమును మెచ్చుకొన్నాము. మా అవివేకమునకు విచారపడ్డాము. ఆయన దర్శనభాగ్యము ననుభవించిన పుణ్యమూర్తులను ప్రశంసించాము. మా తమ్ములు ఆయనను దర్శించుటకొఱకు పరుగెత్తారు. "సిరికింజెప్పడు, శంఖుచక్రయుగముంజేదోయిసంధింపడు" అనే పద్యము స్ఫురణకు వచ్చింది. ఆనాడు అత్యంత దీనావస్థలోనున్న తన భక్తుడైన గజేంద్రుని రక్షింప శ్రీకృష్ణుడే అలా వచ్చాడు. ఈనాడు దీనముగా వేడుకొన్న భక్తురాలు మా కృష్ణ కోరికను నెరవేర్ప గాంధీ మహాత్ముడే ఈలా వచ్చాడు. రామదాసుకథ జ్ఞప్తికి వచ్చింది ఎల్లప్పుడు తనను ప్రార్థిస్తున్న రామదాసునకు కనబడలేదు రాముడు. తానీషాకు కనపడ్డాడు. ఆయనరాకకొఱకెదురుచూస్తున్న మేమెవరము ఆయనను చూడలేకపోయాము. గాంధిగారెవరో తెలియని మాయింట్లో కాపురమున్న ఆయనకు గాంధీగారి దర్శన సంభాషణ భాగ్యము లభించింది.

తొలిరోజున ప్రయాణముచేసి, గంటసేపు ఉపన్యాసము చేసి, చాలాసేపు ప్రజలతో సంభాషణలు సల్పిన అర్భక శరీరి అలసిపోయివుంటారు—ఊరకే అన్నారుగాని అంత వేకువనే లేస్తారా అనుకొన్నారు ఆయన అనుచరులు. వారంతా లేచారో లేనేలేదో. కాలమునుబట్టి సూర్యుని సంచారములోనైనా వ్యత్యాసముంటుందిగాని గాంధిగారి సంచారములో వ్యత్యాసముండదు.

ఇటువంటి నియమపాలకుడు, ధర్మసంస్థాపకుడు, సర్వ మానవ సోదరుడు, నిరాడంబరజీవి, పరిపూర్ణ మానవుడు, భగవదంశ సంభూతుడు గాంధీ మహాత్ముడు. ఆయనకు నా భక్తిపూర్వకమైన జోహార్లు.



# అవతారమూర్తి గాంధీజీ

❋ శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారు ❋

మహాత్మునితో సాటియైన మహనీయుడుగాని యవతార పురుషుడుగాని మహర్షి గాని ప్రవక్తగాని రాజనీతివేత్త గాని సంఘ సంస్కర్తగాని యెవరైనా ఉన్నారా అని వెతికితే యెవ్వరూ కానరారు. ఆయన కాయనయే సాటి.

భార్యను త్యజింపని శ్రీరాముడు, జారచోరత్వములులేని శ్రీకృష్ణుడు, అహంకార అహంభావములు లేని మహర్షి, అహింసను వీడని బుద్ధుడు, తన మతస్థాపన కొరకు ప్రాణహింస చేయని మహమ్మదు, భూమిమీద స్వర్గరాజ్యమును నెలకొల్ప ప్రాణములర్పించిన యేసుక్రీస్తు గతించిన మహాపురుషులు. ఒక్కొక్కరిలో ఒక్కొక్క మహాత్మ్యము మాత్రమే కనబడుచున్నది. ఒక్కొక్కరు ఒక్కొక్క విషయములో మహాత్ములు కాగలిగిరి. కాని గాంధీ మహాత్మునిలో అన్ని యుత్కృష్ట ధర్మములు ఇమిడి యున్నవి. ఈయన ఒక హిందూదేశమునకే యననేల ప్రపంచమునకంతకు ఆదర్శనీయమైన, మాలిన్యములేని సత్యాహింసలతో గూడిన మహోత్కృష్ట హిందూమత ప్రచారకుడు. సైన్యముగాని, ఆయుధములుగాని, తుదకు పరుషవాక్యమైనను నుపయోగింప నక్కరలేకుండ కుట్రలు, పన్నాగములు, మాయోపాయము, మిత్రద్రోహములు, చతురోపాయ సాధనములు మొదలగు వక్రమార్గములులేని నిష్కళంకని ష్కపట నిరాడంబరమైన సాత్విక నిరోధమను రాజనీతి నవలంబించి ప్రాణిహింస చేయలేని రాట్న చక్రమును చేబూని బలవద్విరోధియైన సామ్రాజ్య;తత్వము నెదుర్కొని స్వరాజ్యమును గొనివచ్చిన గొప్ప రాజనీతి వేత్త. వందలకొలది సంవత్సరములనుండి సంఘములో పాదుకొని పోయియున్న అస్పృశ్యతను, స్త్రీ జాతి యొక్క దుర్బలత్వమును నివారింపజేసి సర్వమానవ సమానత్వమును పునరుద్ధరింపజేసిన గొప్ప సంఘ సంస్కర్త. దరిద్రముతో బాధపడు ప్రజలకు దాని నివారించు విధానమును బోధించి దేశములో దారిద్ర్య దేవత తొలంగు సూత్రములను గనిపెట్టిన అర్థశాస్త్ర వేత్త.

ఒకటననేల భగవంతునిలోనైనా నేమేని లోపము లుండవచ్చును గాని యీ మహనీయునిలో నే లోపమును గానరాదు. పరిపూర్ణుడు, కేవలము భగవంతుడనియే చెప్పవచ్చును. అట్టి మహనీయునికి అట్టి పరిపూర్ణ మానవునకు ఇట్టి ఘోరమరణము సంభవించుట శోచనీయము. కేవలము భగవంతుడే అయిన శ్రీకృష్ణ భగవానుడు ఒక సామాన్యపు యెరుకలవాని బాణఘాతముచే యవతారమును చాలింపవచ్చినది. నేడు మరల కేవలము భగవంతుడే యని చెప్పదగు గాంధీ మహాత్ముడు ఒక సామాన్యపు మతోన్మాది యొక్క తుపాకి గుండుకు దెబ్బకు గురియై యవతారమును ముగింపవలసివచ్చినది. ఈ మహనీయుడు మనలను దుఃఖసాగరములో ముంచి తన యవతారమును చాలించినను ఆయన యాత్మ, దివ్యజ్యోతి ప్రపంచ ప్రజలందరిలోను ప్రవేశించి యతిహేయమైన రాక్షస ప్రవృత్తిని వారి హృదయములనుండి తొలగింపజేసి మానవుల నందరను దేవతలనుగా మార్చి గాంధీ మహాత్ముని మహోన్నతాశయమైన స్వర్గరాజ్యమును, భగవంతుని రాజ్యమును భూమిమీద స్థాపించునట్లు చేయుగాక!

ఇట్టి యుత్తమోత్తముని సమకాలికులమైన మనము చాలా యదృష్టవంతులము. మనము పుణ్యము చేశామో లేదో మనకు తెలియదుగాని ఇట్టి మహోత్కృష్ట పురుషుని కాలములో మనము జన్మించుట, ఆయన సహచరులమగుట, ఆయన పవిత్రోపదేశముల నాలింప నోచుకొనుట ఆయన దివ్యమూర్తిని సందర్శింపగల భాగ్యము కలిగియుండుట ఇవే మనము పుణ్యాత్ముల మనుటకు తార్కాణము. వెనుక మహావిష్ణువు శ్రీ రామవతారమెత్తినపుడు దేవతలందరు ఆయనకు సహచరులై భూమిమీద జన్మించిరట. అట్టి యదృష్టమే మనకు లభించినది.

ఈ లోకోత్తర పురుషుడు, భగవదంశ సంభూతుడు, అవతారమూర్తి యొక్క పర్యాయము మా గృహములోనున్న

# అవతారమూర్తి గాంధీజీ

కీర్తిశేషుడైన మా సోదరుడు రామారావుయొక్క చిత్రకళా మందిరమును మా సోదరి శ్రీమతి బుచ్చికృష్ణమ్మ వేసిన చిత్తరువులను చూచుటకు వచ్చెను. తొలినాడు మా సోదరి వెళ్లి ఆయనను ఆహ్వానింపగా రేపు ఉదయము సరిగా 6 గంటలకు వచ్చెదనని చెప్పిరి. మేమంతా అపరిమితానంద భరితులమయాము. మా గృహము పావనమగు ననుకొన్నాము. ఉదయముననే స్నానములుచేసి పరిశుభ్ర వస్త్రములను ధరించుచున్నాము. మా యూహ-ఆయన కారులో వచ్చుననియు, ఆయన కారుతోబాటు ఇంకా చాలా కార్లు వచ్చుననియు, ఆ చప్పుడు వినగానే క్రిందికి పరుగెత్తవచ్చుననియును. మా సోదరికి ఆయనయొక్క తత్వము కాలనియమ పాలనము (Punctuality) బాగా తెలుసు. ఆమె చడీ చప్పుడూ కాకుండా స్నానముచేసి శుభ్రమైన బట్టలను కట్టుకొని పూలదండ నొకదానిని చేతబట్టుకొని చిన్న కుఱ్ఱవాడు నాలుగేళ్లవాడు మా మరియొక చెల్లెలి కొమారుని తీసికొని చిత్రకళా మందిరములో సిద్ధముగా నున్నది. మా అమ్మమ్మ ఆయనను నిజముగా భగవంతుడేయని భావించు భక్తురాలు. ఒక పళ్లెములో హారతిదీపము, పండ్లు, తాంబూలము పెట్టుకొని నిలువబడియున్నది. మా యింట్లో కాపుర మున్న ఒక ఆయన వీధియరుగుమీద ముఖము కడుగుకొంటున్నారు. మోకాటి ధోవతి, పైబట్ట, చేతితో కఱ్ఱపుచ్చుకొని యెవరి సహాయము లేకుండా ఒంటరిగా గాంధిగారు చిత్రకళామందిరపు గుమ్మము తెలియక రెండవ గుమ్మము వద్దకు వస్తున్నారట. ఆ ముఖము కడుగుకొనే ఆయన ఈయననుచూచి యెవరో బిచ్చగాడని యనుకొన్నారట. ఆయన where is Ramarao's art gallery? అని యింగ్లీషులో అడుగగానే అంతక్రితము మేమనుకొనుచున్న మాటలు వింటో మేము పడే హడావడి చూస్తోఉన్న ఆయన గాంధిగారేమోనని ఖంగారుపడిలేచి నమస్కరించి చిత్రకళా మందిరమునకు గొనివచ్చిరి. మా చెల్లెలికొడుకు దండవేశాడు. మా చెల్లెలు నమస్కరించింది. అమ్మమ్మ ఆయనకు హారతిచ్చి, పండ్లు తాంబూలము చేతిలోపెట్టి, సాక్షాత్కరించిన భగవానునకు నమస్కరించింది. ఆయన చిత్రములను చూచారు. మా చెల్లెలిని కొన్ని ప్రశ్నలువేసి విషయములు తెలిసికొన్నారు. 5 నిమిషములుండి వెళ్లిపోయారు. అంతా నిశ్శబ్దంగా జరిగిపోయింది. కార్ల చప్పుళ్లులేవు, జయజయ ధ్వానములులేవు. చివరకు మనుజుల అలజడియైనాలేదు. అయ్యో! ఆరుదాటిపోతోంది గాంధిగారు వస్తారని గబగబా మేమంతా బట్టలు కట్టుకొని 6 గంటల 5 నిమిషములకు క్రిందికి దిగాం. మా చెల్లెలు నెమ్మదిగా గాంధీగారువచ్చి బొమ్మలుచూచి వెళ్లిపోయారని చెప్పింది. నిర్ఘాంతపోయాము. ఆయన సమయపాలనమును మెచ్చుకొన్నాము. మా అవివేకమునకు విచారపడ్డాము. ఆయన దర్శనభాగ్యము ననుభవించిన పుణ్యమూర్తులను ప్రశంశించాము. మా తమ్ములు ఆయనను దర్శించుటకొఱకు పరుగెత్తారు. "సిరికింజెప్పడు శంఖుచక్రయుగముంజేదోయిసంధింపడు" అనే పద్యము స్ఫురణకు వచ్చింది. ఆనాడు అత్యంత దీనావస్థలోనున్న తన భక్తుడైన గజేంద్రుని రక్షింప శ్రీకృష్ణుడే అలా వచ్చాడు. ఈనాడు దీనముగా వేడుకొన్న భక్తురాలు మా కృష్ణ కోరికను నెరవేర్ప గాంధీ మహాత్ముడే ఈలా వచ్చాడు. రామదాసుకథ జ్ఞప్తికి వచ్చింది ఎల్లప్పుడు తనను ప్రార్థిస్తున్న రామదాసునకు కనబడలేదు రాముడు. తానీషాకు కనపడ్డాడు. ఆయనరాకకొఱకెదురుచూస్తున్న మేమెవరము ఆయనను చూడలేకపోయాము. గాంధిగారెవరో తెలియని మాయింట్లో కాపురమున్న ఆయనకు గాంధీగారి దర్శన సంభాషణ భాగ్యము లభించింది.

తొలినాడున ప్రయాణముచేసి, గంటసేపు ఉపన్యాసముచేసి, చాలాసేపు ప్రజలతో సంభాషణలు సల్పిన అర్భక శరీరి అలసిపోయివుంటారు—ఊరకే అన్నారుగాని అంత వేకువనే లేస్తారా అనుకొన్నారు ఆయన అనుచరులు. వారంతా లేచారో లేనేలేదో. కాలమునుబట్టి సూర్యుని సంచారములోనైనా వ్యత్యాసముంటుందిగాని గాంధిగారి సంచారములో వ్యత్యాసముండదు.

ఇటువంటి నియమపాలకుడు, ధర్మసంస్థాపకుడు, సర్వ మానవ సోదరుడు, నిరాడంబరజీవి, పరిపూర్ణ మానవుడు, భగవదంశ సంభూతుడు గాంధీ మహాత్ముడు. ఆయనకు నా భక్తిపూర్వకమైన జోహార్లు.



అశోకా అమ్లా హేర్ ఆయిల్

మనోహరమగు పరిమళముగలది

*Lovely long hair* 273













Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras
Printed by M. Satyanarayana at the H. P. Press, 12, Thanikachalam Chetty Road, T'Nagar, Madras.





Wrapper printed at Ananda Press, Madras